# అలాస్కా రాండిసు

— పాంచాలి



'విజయ' అనుబంధ మాలికలో

వెలువడ్డ పదవ నవల

విజయ
80. ధనలక్ష్మి కాలనీ
మద్రాసు-26

# విజయ అనుబంధం

'VIJAYA' SUPPLEMENT No: 11
OCTOBER 1976

'LAMBADOLLA RAMDASU'
PANCHALI

ముఖచిత్రం : గంగాధర్

వెల : చెల్లింపలేనిది
(ఇది 'విజయ' పత్రికతో పాఠకులకు
ఇవ్వబడ్డ అమూల్య కానుక)



ప్రింటర్స్:
విజయా గ్రాఫిక్స్,
8. ఆర్కాట్ రోడ్,
మద్రాసు-600 026.

# లంకమేస్తరింపు

—పాంచాలి

నేనా పల్లెకు చాలా రోజులనుండి వెళ్ళాలనుకొన్నాను. కానీ, వెళ్ళడము పడింది కాదు. ఆ నాటికా ఆశను కార్యరూపంలోనికి లాగాను. అవి చలి కాలానికీ, వేసవి కాలానికి మధ్య రోజులు——

ఉదయం చలి, మధ్యాహ్నానికి ఎండ మిటమిట లాడుతూంది. మాగాణి మాగాణం ఓటలు వారింది. ఆ ఓటల్లోని చెమ్మతో, కోసి వదలిన జొన్నమోడు, వరిమోడు చిగురించాలని ప్రయత్నం చేస్తూన్నవి.

జనుమూ, కంది తలలు విరబోసుకొని పూతమీదుండి, వరి మోడును చూచి ఎగతాళి చేస్తూంది.

లంకలో పొలం పొట్టలు పగలకొట్టుకొని మొక్కజొన్న కంకెలను చూపి నోరూరిస్తూంది.

చిలుగడదుంప ఏపుగా పెరిగిపోయి నాగలికోసం ఎదురు చూస్తూంది.

ఏరు వయసుకత్తె పడుచులా ఆ వంకా ఈ వంకా యిసుక తిన్నెల మధ్య సన్న పాయగా పారుతూంది.

మిరప తోటల్లో కెంపులు పొదిగినట్లు, మిరపపళ్ళు దూరానికి కనిపిస్తున్నాయి.

ఏటిగట్టుకానుకోనున్న పంట కాలవలో నీళ్ళు మోకాటిబంటి కొస్తున్నాయి. పల్లెపడుచు బిల్లకట్టుకోసం అగకుండా చీరె కుచ్చిళ్ళు ఎగబట్టి, యీవలి వంకకు వస్తూంది. అది వయసు పక్షపాతనం. అగి పోయిన బిల్లకట్టు బిల్లమీద కాకులు రెండు మాటాడుకుంటున్నాయి- నీళ్ళు మళ్ళీ వస్తాయా, రావా అని కాబోలు.

కాలవ గట్టునే నడుస్తూ పేదరైతు పురిలో ధాన్యానికి వెం కట్టుకొని విరుటి సంగతి మరచి, ఈ యేటికైనా పిల్ల పెళ్ళిచేయాల సిందే అనుకొంటున్నాడు.

అప్పటిదాకా కొండమీద ఆకులు మేసిన ఆలమంద యింటికి చేరాలని బయలుదేరింది.

వాటి కాళ్ళ క్రింద నల్లరేగడ నలిగి దుమ్ముగా మారి ఆకసాని కెగసిపోతూంది.

ఆలమంద వెంటవున్న గోపాలురు 'ఏహే', 'ఏహే' అని ప్రక్క చేలల్లో మూతులు పెట్టకుండా గదమాయిస్తూ వాటి వెనక కర్రలు పుచ్చుకొని వస్తున్నారు.

రామాలయం ముందున్న రచ్చ చెట్టుక్రింద చుట్ట కాలుస్తూ, ఊరు పెద్ద ఈ యేటి పంటకు తన చలవేనని తలపోస్తున్నాడు. మున సబుగారి జీతగాడు కరణంగారి కర్రికోడె తన కామందు చేలో మూతి పెట్టిందని కారుకూతలు కూస్తూ, ఆలయం ముందుగుండా హడావుడి పడుతూ పోతున్నాడు, వాడి సొమ్మంతా పడిపోయినట్టు.

కావిడి బుజాన పెట్టుకొని చెరువుకు నీళ్ళకుపోయే కరణంగారి కమతగాడు కావిడిబద్దలా నిటారుగా నిలిచి, తలెగరవేసి తన దోవన తాను వెళ్ళాడు.

అతని కెదురుగా వస్తున్న వయసులోని పడుచు, 'నే వచ్చే దాకా ఆడే ఉండుబావోయ్' అని వెళ్ళిపోయింది- చంకలో బిందెతో చనుదోయి సరసమాడగా, కాలి అందెలు నేలకేదో గుసగుసలు చెప్పు తుండే గలగల నడచి.

పిట్టల అల్లరి, కాకుల గోల, దూరాన కుక్కల మొరుగుడూ సందెలో ప్రకృతి బిడ్డ పల్లెసీమ ఆనందంగా, కోలాహలంగా ఆడు కుంటూంది దేశం వడిలో వున్న సంగతి మరచిపోయి—

ఒకప్పుడు ఆ బిడ్డంటే దేశమాతకెంతో ప్రీతి. ఆనాడు పైరు పచ్చలతో కలకలలాడుతూ బస్తీకి పెట్టేది. సౌష్ఠవం, నిర్మలత్వం ఆమె గుణాలు.

కష్టించి చాకిరీచేసే ప్రతివానికీ కరువుండేది కాదు అక్కడ. ఆమె ఒడిలో ఆడుకుండే వాళ్ళంతా దయాళువులు. దానం, ధర్మం, ఆప్యాయత, ప్రేమ, జాలి వాళ్ళ ఎదల్లో ఉండేవి. మోసం, దగా, కుట్ర, కృత్రిమం, అవినీతి ఎరుగరు. ఐతే యేం- చూచి నేర్చుకోడం అలవాటైన మానవజాతి మనుగడకొరకు ఏదేదో చేసేది. పల్లెకన్న బస్తీయే మంచిదన్న తీరుకు మారిపోయింది మనిషి మనస్సు, పల్లెతత్వం!

పల్లెల్లో పొద్దుపోవడంతో ఎక్కడి వాళ్ళక్కడ ఉన్నచోటు తెలియని తీరుగా ఊరకుండిపోతారు. ఏదేనా సందడి అంటూ పల్లెలో ఉంటే అక్కడ రామకథో! బుర్రకథో! జంగంకథో! వీధి భాగవతమో! ఇదీకాదా, తోలుబొమ్మలాటో ఉండాలి. ఏదీ లేనిదే ఎనిమిది గంటలు దాటాక పల్లెలో మేల్కొనుండడం జరగదు.

పల్లె నిశ్శబ్దంగా ఉంది. దూరాన నక్కల కూతలు వినిపిస్తున్నాయి. ప్రకృతంతా తెల్లగా ఉంది. వెన్నెలలో చందమామ పాలకడలిలో పుట్టిన మాట వాస్తవం అనిపిస్తుంది అది గమనిస్తే. నేను వస్తూవస్తూ తెచ్చుకున్న పుస్తకాలు ఆ నాలుగు రోజులనుండీ చదవడంతో పూర్తయిపోయాయి. ఏమీ తోచడంలేదు. వెన్నెల చల్లగా ఉండి చల్లని ఊహాలను తెస్తూంది. ఆ ఊహలు రాగానే అసలు నన్ను నేను నిలుపుకోలేకపోయాను ఆ నాలుగు రోజుల్లో నా కళ్ళబడి ఆకర్షించిన ప్రతి పల్లెపిల్లా గుర్తు రావొచ్చింది. ఏమీ తోచక ఆ చల్లని వెన్నెల్లో బయలుదేరాను. బస్తీలోవాణ్ణి కావడంతో ఆ పల్లె నాకు తిరగడానికి చాలిందికాదు, రెండువంకలా కొండలు. ఒకవంక యేరు, నాలుగోవంక చేలు. యింక తిరిగేదెక్కడ? సరిగ్గా రెండు ఫర్లాంగుల దూరంలో ఆ ఊరు. వెళ్ళిపోదామంటే మనసొప్పదు. ఉండడానికేమీ తోచదు. అలాగే నాలుగు రోజులూ గడిపివేశాను. అది ఐదవరోజు, అలా బయలుదేరి అటూ యిటూ చూచుకుంటూ వెన్నెలహాయి ననుభవిస్తున్నాను. ఇంకా మంచు కురవడం సాగలేదు.

అది సాగితే యిక విలవడంకూడా కష్టం. ఏవో కుక్కలు నన్నాపాలని ప్రయత్నించాయి. వాటి అలజడికి వాటి తాలూకు మనుష్యులు 'ఎవరు వారు!' అన్నారు.

"ఆఁ!" అన్నాను నేను.

"అయ్యోరింటి కొచ్చినాయినలే!" అని వారిలో వారు సర్దుకున్నారు. ఒక గొంతు, "అయ్యో! యాడకీ ఈ యాలప్పుడు బయలెల్లావు, పురుగూ పుట్రా ఉంటది" అన్నాదెవరో. నాకు తెలియదు.

"ఆఁ యిక్కడిదాకా" అన్నాను. ఆ తర్వాత మాట రాలేదు, అలాగే సాగిపోయాను. ముందుకు పోయిపోయి కాలువగట్టు చేరాను. గట్టుమీద అటూ యిటూ చూస్తున్నాను.

అలా చూస్తున్న నాకు, ఇక్కడ ఈ కాలువ గట్టు కన్న ఎదురుగా ఉన్న ఏటిగట్టు ఎత్తుగా బావున్నట్లనిపించింది. సరేనని కాలువగట్టు వదలి, కాలువలో దిగి, అవలి గట్టుకు చేరి ఎత్తుగా ఉన్న ఏటి గట్టు మీద విలిచి, నీటిలోనికి చూచాను. ఎంత బావుందో చెప్పడం కష్టం.

"ఏటి కడుపున దాగి తోట నిదరోయింది.

ఎన్నెలంతా మేపి ఏరు నెమరేపింది."-నండూరు సుబ్బారావు గారు చిరంజీవి. బావులేని భావం. అది చూస్తేగాని తెలియదు. అప్పటికీ అంత బావున్నదే, ఏటిలో నీరు నిండావుంటే ఇంకెంత బావుంటుందో అనిపించింది. ఆ దృశ్యాన్ని చూస్తూ అలాగే నిలిచిపోయాను. నేనా అందంలో నుండి తెప్పరిల్లే లోపల చాలా దూరాన కొండకూ ఏటికీ మధ్య నున్న మార్గంలోనుండి సన్నగా వాలు గాలికి——

'మనుష్యులనూ మార్చేసీ
దేవతలా చేసేటీ
లంబాడోళ్ళ రాందాసా!'

ఆ పాట పంచమంలో గాలి అలలతో పాటు మెలికలు తిరుగుతూ నా చెవులకు వినిపించింది. పాట వచ్చే దిక్కుకు నాకు తెలియకుండానే నేను నడక సాగించాను. మనిషి కనిపించలేదు. పాట మాత్రం నాలుగు మూలల నుండీ వినిపిస్తూంది. అలా నడిచి నడిచి దాదాపు కొండదాపుకు వెళ్ళాను. ఏరు ఆ కొండని తిరిగి వచ్చింది. పాట ఇంకా దూరాన వినిపిస్తూన్నట్టుగా అనిపించి నాలుగడుగులు

వేశాను. ఇంకా వెళ్ళాలని పించింది. వెళ్ళాను. అక్కడ నా కేమీ కనిపించలేదు.

పాట కొండలోనుండి వినిపిస్తున్నట్టు అనిపించింది. నేను వెనక్కు తిరిగి చూచాను. నేను చాలా దూరం నడిచాను. పల్లెలోని దీపాలు చాలా దూరంగా కనిపిస్తున్నాయ్. గబాలున అనిపించింది—

ఏమిటిది! ఇక్కడ పాడే పాట అక్కడకు వినిపిస్తుందా? విని పించదు. ఇక్కడెలా వినిపిస్తుందో అక్కడా అలాగే వినిపించి ఎ. నేనేదో మోసపోయాను. లేదా భ్రమపడి ఉండాలి.

నాలో నాకే అనిపించింది. యిది భ్రమా? ఇంతకు ముందు విన్నది భ్రమా? ఏది భ్రమ? ఇలా కాదు. ఆలోచించాలి. అని అను కొంటుండగా పకపక నవ్వు వినిపించింది. ఆ నవ్వుకు కొండ ప్రతి ధ్వనించింది. అది పిచ్చి నవ్వు. ఆడదానికి పిచ్చెక్కితే నవ్వే తీరులో ఉంది. ఆ తర్వాత ఏడుపు వినిపించింది. అదీ అంతే- పిచ్చిగానే. దీనికి కూడా కొండ ప్రతిధ్వనించింది. నాకు భయం వేసింది. ఒక్కసారి గుండె గతుక్కుమన్నది. తిరిగి ఇదంతా అబద్ధం, అసలు భ్రమ ఇప్పుడు పడుతున్నాను అనుకున్నాను.

అంతలో లావుపాటి కడియాల మ్రోత వినిపించింది. ఆ తర్వాత నా దాపులోనే దంతం గాజులు కొట్టుకుంటున్న సద్దు వినిపిం చింది గట్టిగా. చూచాను. ఎవ్వరూ లేరు. నాల్గు వంకలా పరికించి చూచాను, ఎవ్వరూ కనిపించలేదు.

ఇదేదో తమాషాగా ఉందే అనుకున్నాను.

నా వెనుక కడియాలు మ్రోగినట్టు సద్దయ్యింది.

వెను దిరిగి చూచాను.

వెనుక ఎవ్వరూ లేరు.

అప్పటికి నాకు భయం వేసింది. అంత చల్లని గాలిలోనూ వణుకు పుట్టింది.

తిరిగి నా వంక ఎవరో వస్తున్నట్లనిపించింది. ఎప్పుడూ రాలే ఏ. ఏమిటో అనుకున్నాను. నా ముందునుండి ఎవరో పోతున్నట్టుగా కళక్ కళక్ మని కడియాలు కొట్టుకుంటూ మనిషి నడిచి పోయినట్టు సద్దు అటుగా పోయింది. ఆకారం కనిపించలేదు. ఆ సద్దు లా

అలా వెళ్ళి ఆ దాపులో వున్న ఒక రాతి దగ్గర ఆగిపోయాయి నేన లాగే నిలువు గుడ్లుపడి చూస్తున్నాను, నేను చూస్తుండగానే ఏడుపు మొదలయింది, ఆ ఏడుపులో—

"రాందాసూ! నీకు నామూలా నీ గతి పడుతుందనుకోలేదు. అన్యాయం చేశారు రాందాసూ, అన్యాయం చేశారు. వాళ్ళందరూ నరకానికి పోతారు రాందాసూ! నువ్వనే నరకం వాళ్ళకు తప్పదు రాందాసూ, తప్పదు." అని ఏడుస్తూనే- ఆ ఏడుపులోనుండే, ఆ స్థాయినుండే—

"మనుషులనూ మార్చేసీ
దేవతలా చేసేటీ
లంబాడోళ్ళ రాందాసా!"

అని పైస్థాయికి వెళ్ళి అక్కడ తిరిగి ఎక్కిళ్ళు పెడుతూ ఏడుపు వినిపించింది.

వాయిద్యాలు లేవు. సంగీత శాస్త్రరీత్యా పాడలేదు. ఆవేదన, బాధ, వ్యథ ఆ వ్యథలోని ఆలాపన అది. అదే రాగమో ఎవరికి తెలుసు? నన్ను నేను మరచిపోయాను. నేనేం చేస్తున్నదీ నాకు తెలియలేదు. సరాసరి రాతి దగ్గరకు వెళ్ళాను. అక్కడ ఆకారం లేదు. లేచినట్టు గల గల సద్దయింది.

"ఎవరు నీవు?"-అని ఆడ గొంతు అడిగింది.

గొంతు వినిపిస్తుంది. ఆకారం కనిపించదు.

ఎవరు నీవుఅంటే ఏం చెప్పాలి? నే నెవర్నని చెప్పాలి?

"నేను బస్తీ నుండి పల్లెకు వచ్చాను." అన్నాను.

"ఇక్కడి కెందుకు వచ్చావు?" అంది గొంతుక.

నాలో భయం పోయింది. ఆకారం కనిపించడం లేదే అన్న ఆలోచన లోపల ఉన్నా, భీతి మాత్రం లేదు.

"ఆ పల్లె ప్రక్క కాలువగట్టు మీద ఉండగా నీ పాట వినిపించింది. ఆ పాట వింటూ ఇటు వచ్చాను. నీ వెవరు? నాకు కనిపించవేం?" అని అడిగాను.

బాధగా స్వరం నవ్వినట్లు తోచింది.

"నాకు కనిపించవేం?" అన్నాను.

"నే నెవ్వరికీ కనిపించను. ఇంతే" అన్నది.
"అంటే?"
"నేను ఆత్మను. నాకు శరీరం లేదు. నా శరీరాన్ని చాలా కాలం క్రితం వదలిపోశాను" అంది.
"అంటే దయ్యానివా?"
"నాకేం తెలుసు? దయ్యాన్నో, భూతాన్నో!"
"చాలా తమాషాగా ఉందే!"
"ఉంటుంది. చదువుకుంటూ సరసాలతో ఆనందంగా తెలియకుండా జరిగిపోయినన్నాళ్ళూ తమాషాగానే ఉంటుంది."
"నీవు మరోలా అనుకోకు. నేను తెలుసుకోవాలని అడుగుతున్నాను. అసలు నీ వెవరు?" అని అడిగాను.
"నేనొక లంబాడీనాన్ని!" అంది.
"ఊఁ!" అన్నాను-తెలుసుకోవాలని. ఇంకా చెప్పు అంటున్న రీతిలో, తెలుసుకోవాలనే.
"నమ్మకం లేదా?" అంది.
"నాకేమీ పాలుపోవడంలేదు!" అన్నాను.
"అదే హాయి. అలాగే ఉండు"
"అదిసరేగాని, నీవు పాడావు చూడు-ఆ పాట చాలా బావుంది. ఆ పాటలో లంబాడోళ్ళ రాందాసా అంటున్నావే-అతనెవరు? అతనికీ నీకూ సంబంధమేమిటి?" అడిగాను.
సమాధానం రాలేదు. కొన్ని క్షణాలు చూచాను.
"నీవు నిరాకారంగా ఉన్నావు. ఏం చేస్తున్నావో, ఎలా ఉన్నావో తెలియడంలేదు. నిన్ను నే నేమని పిలవాలో అర్థంకావడం లేదు. నీ పేరేమిటి?" అన్నాను.
"నాకిప్పుడు పేరూ, ఊరూ, ఆకారం లేదు."
"నీకు ఆకారం ఉన్నప్పటి సంగతి-అన్నట్టు శరీరాన్ని వదలానన్నావుకదా? ఆ శరీరం ఉన్నప్పుడు ఆ శరీరాన్ని ఏం పేరుతో పిలిచేవారు?" అనడిగాను.
"అదంతా నీ కెందుకు? నీ దారిన నీవు వెళ్ళు" అంది.
"ఏం, రహస్యమా? పోనీలే! ఆ రాందాసెవరు?"

"నీకు నేనేం చెప్పేదీ? నాకంతా తెలుసు. గతం, జరగబోయే భవిష్యత్తు అంతా తెలుసు. నీ వెవరో, ఎందుకు వొచ్చావో కూడా తెలుసు. నీ మనస్సులో ఉన్నది కూడా తెలుసు. జరిగిందీ, జరగబో యేదీ నాకు తెలుస్తుంది."

"నాకేమీ తెలియదుకదా! పోనీ నే నెవర్నో చెప్పు?"

"నువ్వొక రచయితవు. ఇప్పటివరకూ నీకు ఆ పాట మీద అభిప్రాయం తప్ప మరొకటి లేదు. నేను ఎలాగూ నీకు జరిగినదంతా చెప్తాను. దాన్ని నీవు పుస్తకంగా రాస్తావు. చూచావా? నీకింతవరకూ ఆ అభిప్రాయం లేదు. కానీ, అంతా విన్నాక నీకా అభిప్రాయం కలుగుతుంది."

"అలాంటప్పుడు ఎందుకు చెప్పవు?"

"సరే. విను! నీకు చెప్పడంలో, నేను పట్టకముందు జరిగినవి కూడా చెప్పగలను. నేనక్కడ లేకపోయినా జరిగినవి నాకు తెలుస్తాయని మరచిపోకు. నా వెనుక జరిగింది కూడా నాకు తెలుసు. అంటే నేను శరీరంతో ఉన్నప్పుడు కాదు. శరీరం వదలాక సంగతన్నమాట- అంతా తెలుసుననడం. ఇక్కడ కూర్చుంటే ఇంకా కొంతసేపటికి మంచు పడుతుంది. ఆ మంచు నన్నేం చేయదు. కానీ నీకు జబ్బు చేస్తుంది. శరీరమున్నంత కాలం నిప్పుకూ, నీళ్ళకూ, గాలికీ, సద్దుకూ ఒకటేమిటి-అన్నిటికీ దడవాలిసిందే. దానితో ఉన్న రోజుల్లో నీవు పడే అవస్థలన్నీ పడ్డాను. లే! అలా వెళ్ళి ఆ చెట్టు క్రింద కూర్చుందాం!" అన్నదామె.

"సరే" నని లేచి వెళ్ళి, ఆ చెట్టు క్రింద కూలబడ్డాను. ఆ తర్వాత ఆమె ఇలా చెప్పింది___

# 2

ఇప్పుడు నీవు దిగిన గ్రామం విషయమే. ఎన్నేళ్ళయిందో తెలియదు. కారణం కాలం కాయానికి సంబంధించింది. నాకు నిన్న జరిగినట్లుగా భావన.

ఆ గ్రామంలో చాతుర్వర్ణాలవారూ ఉన్నారు. పంచములు గూడా గట్టుప్రక్క యిళ్ళు వేసుకోసుండేవారు. ఆ గ్రామానికి సంబంధించిన మాలవాడన్నమాట.

నీవనే హిందూమతం నిర్వాడానికి ఆ మాలవాడు కారణం. ఆ మాలవాడిని గురించి గతం విషయాలు నీకు తర్వాత ఉపకరిస్తాయి. విను.

పై నాలుగు వర్ణాల్లో ఏ వర్ణానికి సంబంధించిన వాడైనా నీచుడు, నికృష్టుడు, దుర్మతి అయినవాడు పంచములలోనికి రావలసిందే। ఈ పంచములది కులంగాదు. దిగజారిపోయిన ఆ హిందూ సంస్థలోని నాలుగు స్థంభాల్లోని యిటుకల ప్రోవే పంచముల వాడ, తెలుసుకో.

అది ఎప్పుడో- ఈ సమాజం వికాసం చెంది, సంస్కృతిని మరచి, జాతిని మరచి విభిన్న దృక్పథాలలో, అధునాతనాన్ని సాధించాలని, స్వార్థంతో బయలుదేరి, క్రొత్త నిబంధనలను ఏర్పరచింది. ఆనాడు ఆ పంచమవర్గం విజృంభించింది. "మీ నాలుగు స్థంభాల్లో నాకూ స్థానం కావాలి. నేనూ మీ లోనికి రావాలి" అని పోరాటం సాగించింది. ఆ పోరాట ఫలితమే జాతిభేదాల విజృంభణం. ఆ విధంగా విజృంభించి వీరవిహారం చేసింది। అణగనున్నవారికి అదను తెలుసుకుని పరాయి మతాలు తావు నిచ్చి, విద్యనిచ్చి, ఉద్యోగమిచ్చి తమ మతంలోకి కలుపుకున్నాయి. హిందూమతం అణగునపాటి వేసినప్పుడు అల్లాడిపోయిన పంచమజాతి పరాయి మతాల్లో చేరి, ఏదో బావుకోవాలని ఇహానికీ, పరానికీ చెడిపోయింది. వీరంతా తల్లిపాలు త్రాగుతూ తల్లి రొమ్ము గుద్దే తీరుకు దిగజారిపోయారు. అలా వారు తయారు కావడానికి నీ మతంలోని అగ్రవర్ణం చేసిన దుండగం.

నీ పురాణాలలో లేని అహం వర్ణం వెట్టితలు వేయడం, ఆ తర్వాత వారిని సంస్కరించడం వలన జరిగిన కీడది. లేకుంటే హైందవ మతంలో కులానికి గణన ఉన్నదా? వసిష్ఠుడు శిష్యుడై అరుంధతిని చేసుకుంటే దశరథుడు పురోహితం మాన్పించలేదేం? తపస్సుతో బ్రహ్మత్వం సంపాదించిన క్షత్రియుడు - మూడవ వర్గంలోనివాడైన విశ్వామిత్రుడు బ్రహ్మరిషయ్యాడేం? మచ్చగంధిని యోజనగంధిగా

మార్చి రంకు చేసుకున్న సంతానం రాణకెక్కి వేదవేదాంగాలను ఎలా సంస్కరించగలిగింది? అందుకే—

"చాతుర్వర్ణ్యం మయా సృష్టం
గుణకర్మ విభాగశః
తస్య కర్తర మపిమాం
విద్ధ్యకర్తార మవ్యయమ్"

అన్నాడు భగవద్గీతకారుడు. "గుణాలవలన కులాల నేర్పరచాను. వాటిని అంటీ అంటనట్టు, వికారం లేకుండా వాటికి విలువనీయను. అందువల్ల నేను బాధ్యత వహించడంలేదు. కర్తృత్వాన్ని అపాదించుకోను" అని. అందువల్ల మధ్యవారు చేసే సంస్కారాల వల్ల, బుద్ధినిబట్టి, కర్మనుబట్టి వృత్తినిబట్టి యేర్పరచిన కులం, జాతి కంటకట్టి నాటకమాడారు నీ వాళ్ళు. అందువల్ల మొదటికే మోసం వచ్చింది, శృంఖలాలు త్రెంచుకొని విజృంభించాలని ప్రయత్నిస్తుంది స్వార్థం! నాదీ, నాకూ, నే నెక్కువ అని ఉన్న ఏ జాతిలోనివాడైనా పశువు. పశువుకూడా తన జాతిలో భేదాల నేర్పరచలేదు. అంతకన్న తక్కువ మాట నాకు రాదు. బహుశా సాహిత్యం లేదు. పంచముడని వాడతారు. అంతకన్న దిగజారిపోయిన వాణ్ని వారితో పోల్చడం అనమంజసం. మానవజాతి మనుగడ కేర్పరచుకున్న వృత్తులు, కులాలు జాతి కంటకట్టి జాతర చేసుకొంటున్నారు. నేనీ స్థితికి వచ్చాక తెలుసుకొంటున్నాను - మనిషికి కులం లేదు- గుణం ప్రధానం!

అసలు హిందూమతం మతం కాదు. సమగ్రమైన మానవ సంస్కృతి ధర్మం. అది చావదు. చావకపోవడానికి కారణం అది పుట్టిందికాదు. పుట్టుకలేని దానికి చావేమిటి? ఎన్నో మతాలూ, ఎందరో సంస్కారులూ రావచ్చు, పోవచ్చు. అవన్నీ క్రొత్తగా హైందవంలో లేనిదానిని చెప్పలేవు. అందుకే హైందవం మానవుల మతం. లోకంలో ఈ గోళంలో ఏ దిక్కున మానవుడై జన్మించినా వాడు హిందువే! కారణం వాని మానవత్వమే. ఎందరో పుడతారు, ఎందరో చస్తారు. అందరూ హిందూమతంలోని ధర్మాల నాచరించాలసిందే గాని, మరో మతంలోని ధర్మంగాదు. ఎందువల్లనంటే హైందవంలో చెప్పనిది క్రొత్తదేమీ లేదు కనక. ఏ కోవకు, ఏ మార్గానికి చెందిన

వాడైనా వాడు హిందువే. ఈ మతం ఎప్పుడూ సన్నగిల్లదు. వెళ్ళి తలబు వేసిన స్వార్థపరుల కార్యాల వలన సంకుచితం ఏర్పడింది—

ఆ! అంతవరకు చాలు. అంతకన్నా పైకి వెళ్ళటం కూడా అంత మంచిదికాదు. అలాటి హిందూజాతిలో వేరుపర్చబడిన జాతిలో- అంటే అగ్రవర్గాలవారి నిర్ణయరీత్యానే సుమా!—

మాలవాడలో రంగదాసరి అనే రామభక్తు వుండేవాడు. ఈ దాసర్లూ, ఈ జంగాలు వీరంతా జనంలో పాపాని కి స్కారం లేని కార్యాలు చేయండని ప్రోద్బలపరిచే ప్రచారకులు. వీరే ఒన్యమతాల్లో ఫాదరీలని, మహమ్మదులు. అల్లాలు, ఒల్లీయులుగా ఉన్నారు. ఈ దాసర్లు హిందూమతాన్ని, ధర్మాన్ని నాలుగు మూలలా ప్రచారంచేస్తూ విశ్వాసములై సంఘంలో వేలుబంతులై, సంఘంలో ఉంటూ, సంఘం పెట్టినది తింటూ, సంఘసేవా సమాజ సేవతో బ్రతికేవారు. అలాటి వారిలోనే మాలదాసరియైన రంగదాసువుండేవాడు. ఆయన భార్య రామదాసును కని మరణించింది. ఆమె పోయాక తన తంబురాలా, భజన చెక్కల్లా. రాగి చెంబులా, హైందవ ధర్మంలా ఒదలకుండా కాపాడాడు, రంగదాసు రామదాసును.

అలా వెంట పెట్టుకొని గ్రామ శివార్లన్నీ తిరిగి బిచ్చమెత్తి తన గుడిశకు చేరేవాడు.

అతని ఆస్తి ఆ గుడిశమాత్రమే, అది స్థిరాస్థి. చరాస్థి చెంబూ, భజన పలకలు, తంబురా!

ఆరు వత్సరా లలా జరిగిపోయింది. ఆ తర్వాత ఒకనాడు రంగదాసు రామదాసును ఒంటరిగా చేసి వెళ్ళిపోయినాడు. తన రాముని వెదుక్కొంటూ.

రామదాసు ఒంటరివాడయ్యాడు. దిక్కులేదు. ఆ దిక్కులేని స్థితిలో ఊరివారే రంగదాసు దహన కార్యక్రమాలన్నీ చూచారు. ఆ తర్వాత రామదాసును ఐదు సంవత్సరాలు గొడ్లకాపరిగా పెట్టుకొని వేళకింత పారవేసి బ్రతికించారు. ఈ ఐదు సంవత్సరాల్లోనూ రోజూ రాత్రుళ్ళు ఏదో చదువుమీద జిజ్ఞాసతో గొడ్లసావిట్లో దీపం పెట్టుకొని వచ్చీరాని అక్షరాలు రాస్తూ, చదువుతూ గడిపాడు.

ఆ తర్వాత దానిని వదలివేశాడు. దానికి కారణం-నీవు

విడిదున్న యింటి కామందు మహాపండితుడు. వేదవేదాంగాలు జీర్ణించుకున్న మహానుభావుడు. రామదాసు చేసేపనీ, కార్యక్రమం ఆయన ఆలించి, రంగదాసుమీది దయతో అతని బిడ్డకు చదువు చెప్పాలని రోజూ రాత్రిళ్ళు ఒక గంట తన గొడ్ల సావిట్లో చెప్పేవాడు - ఆ చదువులో రామదాసు చురుకుదనం తెలుసుకొని నీవు నా కులంలో పుట్టివుంటే "నా" అనుకుండే వాడినన్నట్లు. దానికి తగినట్లు రామదాసు గొంతు చాలా శ్రావ్యంగా, గంభీరంగా ఉండేది. ఆ గొంతుకు ఈ గ్రామం, ఈ గ్రామంవార్లు దాసోహమన్నాయి. అతడలా ఆయన పంచ రోజూ చదువుకుంటూ తండ్రి తంబురా, తండ్రి భజనచెక్కలు! ఆ రాగిచెంబూ పట్టుకొని హరినామ సంకీర్తనం చేస్తూ గడుపుతున్నాడు.

ఒకనాడు చదువుకోసం పంతులుగారింటికి వెళ్ళగానే అయ్యగారిని ముందు బెట్టుకొని అలోమని ఏడ్వడం మొదలు పెట్టారు. అతడు దొడ్డి వాకిలినుండి తలవాకిటికి రాగానే అంతా అతన్ని చూచారు. ఐనా ఆ క్షణంలో వారికి అంటరానితనం గుర్తుకు రాలేదు. రామదాసు అంటరానివాడు. ఐనా మాలదాసరి కాబట్టి గుమ్మాల్లో బిచ్చానికి రావచ్చు. దానికి తగినట్టుగా మాలగానీ, మరో జాతిగాని ధనం సంపాదిస్తే ఎలా కులం మరుగున పడిపోతుందో, మించిన విచారంలోనూ అలాగే తారతమ్యాలు మరచిపోతారు. ఆ క్షణం అక్కడ అదే జరిగింది. రామదాసు అయ్యవారిని తలచి ఏడ్చాడు. అందరిలోనూ ఆయన పాదాలంటి శోకించాడు. ఎవ్వరూ కాదనలేదు. చిరాకగా వెనుదిగిరి వెళ్ళిపోతుంటే పంతులుగారి బిడ్డ రామదాసు ముందుకు వచ్చి, "రాముడూ! నాన్నగారు దహనమయ్యేంతవరకూ నిన్ను తన వెంట స్మశానందాకా ఉండమన్నార్రా!" అన్నాడు.

దానితో రామదాసులోని విచారాని కంతులేదు. ఆ మాట విని అలాగే కూలిపోయాడు.

"ఏమిటిది? ఆయన దయ.... ఆయన అతీతుడు. అలాంటి మహానుభావుడితో కొన్నాళ్ళు పాదాలు తాకి సేవచేసే భాగ్యం కలిగించాడు. ఇదెవ్వరికీ లేని భాగ్యం" అంటూ బోరున యేడ్చాడు, ఆ దినమంతా అక్కడే ఉంది. మరునాటి ఉదయానికంతా దహన కార్య

క్రమాలన్నీ ముగిశాయి. అప్పటివరకూ రామదాసు వెంటనంటే ఉన్నాడు. ఆ తర్వాత యింటికి రాగానే అయ్యవారి కొమారుడు మూడు తాటాకు పుస్తకాలు రామదాసుకిచ్చాడు. అవి అయ్యవారు రామదాసు కీయమన్నారుట. ఒకటి రామాయణం, రెండవది భారతం, మూడవది భాగవతం.

ఆనాటికీ ఊళ్ళుగాని, ఈ గ్రామాలుగాని, ఇంతగా స్వార్థ భూయిష్టం కాలేదు. కులమతాలున్నా, ఇంతగా కొట్టుకొని చావలేదు. ఒకరిమీద ఒకరికి ద్వేషాలు లేవు. అందువల్లనే రాందాసు ఆనాడు అలా నిలిచి, కొంచెం చదువూ సంస్కారం అందుకోగలిగాడు— మనిషిగా బ్రతకగలిగాడు.

ఆనాటి రామదాసు మంచి వయసులో ఉన్నాడు. ఇక్కడ నీకో విషయం చెప్పాలి—

ఆనాటికి ఏభై అరవై సంవత్సరాలనాడు-లంబాడీలనే ఒక తెగ తెలుగునాట అక్కడక్కడ తావరాలు ఏర్పరుచుకొంది. అప్పటి వరకూ ఆ తండాలకు ఒక శాశ్వతమైన తావరంలో ఉండాలనిగాని, నివాసాలు కావాలనిగానీ ఉండేదికాదు. వారంతా సంచారులే; సంసారాలు కొన్ని కలిసి తండాగా ఉండి. ఆ తండాకు ఒక నాయకుడు, ఒక గురువూ ఉండి సంచారం చేస్తుంటాయి. వారికీ వారివారి ఆచారాలు ఉన్నాయి. మొత్తానికి ఏ మార్పు కావాలన్నా తండా నాయకుడూ, ఆ గురువూ కలిసి ఏర్పాట్లు చేస్తారు.

అలాటి తండాలు ఆంధ్రదేశ ప్రాంతంలో చాలాచోట్ల, నదీ తీరాలలో తావరా లేర్పరుచుకున్నాయి.

వారికి వృత్తంటూ మరొకటిలేదు. అన్నీ చేయగలరు. ఎక్కువగా కూలిపనులు వారి ఆచారం. మోసం, దగా, కుట్ర ఎరుగని జాతి. చాలా అమాయకులుండేవాళ్ళు. వారికి బుద్ధితో అవసరంలేదు. శారీరకమే. పంట రోజుల్లో, తెలుగు రైతులకు తోడుగా సాయపడి వారిచ్చిన గింజలను అందుకొని, వారు చూపిన తావరాల్లో ఉంటూ, ఆ తర్వాత ఎక్కడికో తిరిగి తండా, తండాగా వెళ్ళిపోయేది.

వాటిల్లోనే కొన్ని తండాలు కొన్ని కొన్ని ప్రదేశాలలో తావరం ఏర్పరచుకొని కదలకుండా నిలిచిపోయాయి.

అలా స్థిరనివాసం ఏర్పరచుకొన్న తండా ఒకటి ఇదిగో మనం కూర్చున్న ఈ తావరంలో ఉండేది. ఇది ఎవరికీ సంబంధించిన నేలగాదు. ప్రకృతి దేవత వదిలివేసిన నేల. అందులోనే తండా వారు ఇళ్ళు కట్టుకొని నిలిచిపోయారు.

ఈ కొండ క్రిందనే అదిగో, ఆ ఎదురుగావున్న జాగాలో కొంతభూమిని సాగుచేసుకొంది. కల్మషరహితులైన రైతులు ఆనాడు కాదనలేదు. ఏమీ అనలేదు. ఆనాడు నిప్పూ, నీరూ, గాలి. ఆకాశం. భూమి అన్నీ ఒకరివిగావు-అందరివీ అన్న ధర్మంలో నడచింది. ఈనాడు మీరు అన్నింటికీ వెలగట్టి కొనుక్కుంటున్నారు. చాకిరీకి తావులేదు. ధనానికి కాసులకు వున్న విలువ మీరు మరొక దానికీయరు. ఆ రోజుల్లో వారికి సొమ్మంటే తెలియదు. అసలు సొమ్ముతో పనిలేదు కూడాను.

అలా జరిగిపోతున్న రోజుల్లో ఎలా వచ్చిందో వచ్చింది పొరుపు-గ్రామం వారికి, తండావారికిన్నీ. ఆ పొరుపు పెరిగిపోయి, గ్రామంవారు తండావారికి పనులు చెప్పడం మానివేశారు. తండా వారిలోనూ గరుకుతనం పెచ్చరిల్లి వారు పని చూపుతుండబట్టే బ్రతుకు తున్నామా? లేకపోతే బ్రతకలేమా? ఎలా బ్రతకలేమో అదీ చూద్దాం-అను కున్నారు. ఇది తెలిసిన గ్రామపెద్దల అహానికి దెబ్బ తగిలి. వారు మరీ రెచ్చిపోయి పనిపాటా పూర్తిగా మాని లంబాడీలంటే ఒక యూస్ట కలిగి, కనిపిస్తే కొట్టుకోవాలన్న తరహాకు దిగజారిపోయారు. ఈ స్పర్థ వారినీ వీరినీ పశువులను చేసివేసింది. గ్రామం తండామీద కత్తికట్టింది. లంబాడీల్లోనూ అభిమానం పెరిగిపోయింది. దాసితో యిటు సుగాలీల తండా-అంటే లంబాడీలే-మరో పల్లెలకు వెళ్ళి పనులు చేసుకొని ఈ తావరంలో తలదాచుకుండేవారు.

రామదాసు వయసులో ఉన్నాడన్నానుకదా: అతగు ఉదయం ఏ వేళప్పుడు లేచేవాడో తెలియదు. భజన చెక్కలూ, తంబురా పట్టు కొని నెత్తిన ఆ రాగిచెంబు పెట్టుకొని మధ్యాహ్నానికి ఈ పరగణా నంతా తిరిగేవాడు. పరగణా అంటే శివార్లు రెండు ఫర్లాంగులకు

పైబడుకు ఒక చిన్న పల్లె, ఒక చిన్న గ్రామం ఉండేవికదా! అంతా తిరిగి నడిరేత్తికి సూర్యుడు చేరేప్పటికి గ్రామానికిచేరి అతని గుడిశలో ఉండేవాడు. ఇదీ అతని నిత్య కార్యక్రమం.

అతని కీ పోరులతో, పొమ్ములతో ప్రమేయం లేదు. అన్ని ఊళ్ళు తిరిగేవాడు. అందరి గుమ్మాల్లో నిలచేవాడు. అతడు రాగ ద్వేషాల కతీతుడు, అతడు కులమతాల కతీతుడు. అందుకే రామదాసు అతీతుడు, మహాభక్తుడు.

గ్రామం ఉడికిపోతూంది తగాదాలతో. ఆ విషయం ఆ భగవ ద్భక్తునికి తెలియదు. తెలుసుకోవలసిన అవసరమేమిటి? తంబూరా మీటుతూ, భజన చెక్కలతో తాళం వేస్తూ తోమిన రాగిచెంబు ఎండ బడి మెరుస్తుండగా వస్తున్నాడు. ఉదయం మొదలు ఆ వేళవరకూ అతని గానమాధుర్యాన్ని, రామనామాన్ని గ్రామగ్రామాల కందించి, అతడు పొలిమేరలో ఉండగా అతని గొంతు నది బొడ్డులో వున్న రామాలయం తలుపులకు తగిలి లోనికి వెళ్ళేది—

అతను పాడే ఆ పాట దూరాన కొండకు తగిలి, తిరిగి ఊళ్ళోకి వచ్చేది. కానీ, ఆ రామయ్య తండ్రి వినిపించుకుండేవాడో, లేదో తెలియదు. లేక విని కూడా విననట్టూరుకుండేవాడేమో! అతడా విధంగా గొంతెత్తి అరుస్తూ ఉంటే రామునికోసం ఏడుస్తూ వెదుకు తున్న రీతిగా ఉండేది. అతడలా పాడుతూ గ్రామంలోని కడుగుపెట్ట గానే—

గ్రామ పెద్ద నిలబడి ఉన్నాడు. రామదాసు నమస్కరించి, "అయ్యా! యిక్కడ నిలుచున్నారేం?" అని అడిగాడు. గ్రామ పెద్ద అక్కడ కెప్పుడూ రాడు. అది గ్రామానికీ, మాలవాడకూ మధ్య దారి. ఇటు వెళితే మాలవాడకు, అటు వెళితే గ్రామంలోనికి వెళ్ళుతుంది. మాలవాడ కావల, గ్రామాని కీవలగా రామదాసు గుడిశ చెట్టు క్రింద ఉంటుంది, దాని కానుకొని యిళ్ళుండేవి గాదు. కాలవకు వెళ్ళేవాళ్లు ఆ యింటి ముందుగా వెళ్ళాలి. గుడిశ వెనుకగా మాలవాడ వాళ్ళు ఆవలి దిగువుకు వెళ్ళి రేవుకు వెళ్ళాలి, సరిగ్గా చెరువుగట్టు మీదుం టుందాతని గుడిశ. అక్కడికి ఏదో పనిమీద వచ్చేవారు తప్ప మరొ కరు నిలువరు. గ్రామపెద్ద నిలచివుండడం చూచి అడిగాడు రామదాసు.

"నీకోసమే రాందాసూ! నీగొంతువిని వచ్చాను" అన్నాడాయన.

"అయ్యో! ఎంతమాట! కాకిచేత కబురుచేస్తే రెక్కలు కట్టుకొని రాకపోయానా?" అన్నాడు.

"అదిసరేగాని. దానికేం! నీవిప్పుడు ఎక్కడనుండి వస్తున్నావ్?" అని అడిగాడు గ్రామపెద్ద.

"ఏముంది బాబూ! రోజూ తిరిగేదేకదా? అట్లా ఊళ్లన్నీ తిరిగి వస్తున్నా" అన్నాడు రామదాసు.

"కొండ క్రిందికిక్కూడా వెళ్ళావా?"

"వెళ్ళాను బాబూ! ఇప్పటివరకూ అక్కడే ఉన్నాను. ఏమిటో పిచ్చి తండ్రులు! వాళ్లది మన భాషా, మన దేవుడూ కాకపోయినా ఒక పళాన వదలరు. పాడూ పాడూ అని ఒకే పట్టున పిలవేస్తారు. వాళ్ళ కేదన్నా చెప్పమంటారా?" అని అడిగాడు రామదాసు.

"చెప్పడం పాడూనూ! యింక నీవా కొండక్రిందకు వెళ్ళకూడదు. వాళ్ళతో మాటలాడకూడదు. వాళ్ళకూ, మనకూ తగాదా వచ్చింది. అటు ఈగ యిటు వాలకూడదు. తెలిసిందా?...."

"బాబూ!" అన్నాడు రామదాసు బాధగా.

"అంతే! ఎక్కడినుంచో వచ్చి మన మోచేతిక్రింద నీళ్ళు త్రాగి బ్రతికే తొత్తుగాడ్దెలు మనమాట నెదిరిస్తారా?"

"బాబయ్యా! ఆలోచించండి. సన్నాసులు, వాళ్ళమీద కత్తికట్టాలా తమలాంటి గొప్పవారు? ఏమిటో బాబూ! అంతా ఎక్కడనుండో వచ్చిన వాళ్ళమే కదా? వాళ్ళు కాస్త వెనక వచ్చారు. మనం కాస్త ముందు వచ్చాం."

"నీ వేదాంతాలు నా దగ్గర కాదు. గ్రామానికట్టుబడి ఉండాలి. జాగ్రత్త! ఆ తర్వాత అనుకొని లాభం లేదు."

"ఏమిటో బాబూ! ముష్టివాణ్ణి. నాకెందుకు చెప్పండి ఈ తగాదాలూ, ఈ కత్తులు కట్టడాలు! నాలుగిళ్ళు అడుక్కుందే ముష్టి వాణ్ణిగదా?"

"అంటే నా మాట కూడా కాదని వెళతానంటావా?"

"అయ్యో, ఎంత మాట! అలా ఎలాగనగలను? కాస్త ఆలోచించండి, ఊరు పెద్దలు! దరిద్రులమీద దండు తీయడం మంచిదా?

మీ హోదా, మీ తాహతూ ఎక్కడా? వాళ్ళు ఎక్కడా? అడుక్కు-తింటూ కొండ క్రింద బ్రతికే సన్నకారు మీద తమరు సవాలు చేయాలా?" అన్నాడు రామదాసు చాలా నమ్రతగా, బ్రతిమాలుతూ, నచ్చజెప్ప చూస్తూ. అసలు గ్రామాల్లో తగాయిదాలు రానేకూడదు. వచ్చాయా వాటికి ఇంతా అంతా అన్నది లేదు. వారికి దయ కలిగినా, దాక్షిణ్యం కలిగినా పట్టు పగ్గాలుండవు.

"రాందాసూ! నేనిన్ని మాటల మనిషినిగాను. ఆలోచించుకో! ఆ తర్వాత నీ యిష్టం!" అన్నాడు గ్రామ పెద్ద.

"ఎందుకు బాబూ! నన్ను వదిలెయ్యండి. ముష్టిముండావాళ్లు"

"అదేం కుదరదు."

"కాస్త పెద్ద మనసుతో ఆలోచించండి బాబూ! మీకు చెప్ప గలిగిన వాడిని కాదు. నాలా అడుక్కు-తినేవాడు వెళ్ళినా జగినా ఒకటే కదా? వాడేమున్నది? అంతేకాదు. వాళ్ళను కాస్త దయ చూడండి!" అన్నాడు రామదాసు.

"రాందాసూ! నేనిన్ని మాటల మనిషిని గాదు! ఆలోచించుకో వలసింది నువ్వు. జాగ్రత్త!" అని చరచరా వెళ్ళిపోయాడు గ్రామ పెద్ద. రామదాసు విచారంగా రామ సంకీర్తన చేస్తూ తన గుడిసె లోనికి వెళ్ళి చెంబు దించి, తంబురా నక్కడ పెట్టి భజన చెక్కలు ప్రక్కనుంచి గ్రామాన్ని గూర్చి, ఊరుగూర్చి ఆలోచించటం మొదలుపెట్టాడు.

"ఏమిటీ మనుష్యులూ, వాళ్ళ ఆవేశాలున్నూ? వాళ్ళేదో అన్నారని వీళ్ళు యింత తిరుగుబాటుగా కత్తికడితే, ఆ చిన్నవాళ్ళేమవుతారు? పాపం లంబాడీలు-వాళ్ళకు మాట్లాడ్డం కూడా రావే, రామయ్య తండ్రీ? నీ దయ! ఎలా రక్షించుకుంటావో! ఏమో బాబూ! వీళ్ళకు మంచి బుద్ధులు నేర్పించరాదా! నీ లోకాన్ని యిలా నానా హింసలపాలు చేస్తే నీ కొరిగేదేమిటి రామయ్య తండ్రీ!" అంటూ తెచ్చిన గింజలు వండుకో డానికి వెళ్ళాడు.

ఆ మరునాడు కూడా ఉదయం లేచి మామూలుగా శివార్లన్నీ తిరిగి వచ్చాడు.

గ్రామంలోని కొందరు కాలువకు వెళుతూ వచ్చి అడిగారు....

"ఏం, రాందాసూ! గ్రామ పెద్ద చెప్పిన మాటకూడా కాతరు సేయనికాడికి వచ్చావన్నమాట!" అన్నారు.

"అదేమిటి బాబూ! ముష్టిముండా వాణ్ణి. నేను లెక్కచేయక మేమిటి, దొరవారంతవారిని!" అన్నాడు.

"ఆఁ అదేలే! బాగా ఆలోచించుకొని బ్రతుకు!" అన్నారు.

"చిత్తం బాబులూ! మీ అందరి దయమీద బ్రతికేవాణ్ణి." అన్నాడు రామదాసు చాలా నమ్రతగా.

"అది మాటల్లోనే కనిపిస్తుంది గాని, చేతల్లో మామూలుగా వుంటె." అని వ్యంగ్యంగా మాట్లాడి వెళ్ళిపోయారు.

రామదాసు కా విషయాలు తెలియవు. అతడు మామూలుగానే ఉన్నాడు. ప్రొద్దుపోయింది. దీపం వెలిగించి, భాగవతం తీసుకొని ఏదో చదువుతూ చాలాసేపు మేల్కొని, ఆ తర్వాత నిదురపోయాడు. అర్ధరాత్రయ్యింది. ఊళ్ళో ఏ సందడీ లేదు. అవి చీకటి రోజులు. పంటంతా ఇళ్ళకు చేరింది. పురులు నిండుగా, దండిగా ఉన్నాయి. ఊరంతా వాములు పేర్చారు. చీకటి అన్నింటినీ సక్రమంగా ఆక్ర మించుకొంది. ఎవరో రామదాసు గుడిశకు నిప్పుపెట్టి పారిపోయారు. పోతూ, తడికను తాడుతో బిగించారు.

ఆ విషయం, లోనున్న రామదాసుకు తెలియదు. అటు మాల వాడనుండి, ఇటు గ్రామంనుండి అంతా పోగయ్యారు. ఆ వెలుగుకు లోనున్న రామదాసు వెలుపలికి రావాలని గుడిశ తలుపు తీయబోయాడు. అది రాలేదు. అలా మండిపోతున్నా చిరునవ్వు నవ్వి, 'రామయ్య తండ్రీ! నీ దయ! నీవు సర్వ రక్షకుడివి,' అంటూ నమస్కరించాడు. రెండు కనులు మూసుకుని అలాగే నిలిచిపోయాడు. అంతలో వెలు పలనుండి. ఎవరో తలుపును బలంగా తన్ని 'రాందాసూ! రాందాసూ'! అన్నారు. పిలుపుకు కనులు తెరచి, అయ్యవారిచ్చిన తాటాకు గ్రంథాలు తీసుకొని బయలు దేరాడు వెలుపలకి. లోనికి వచ్చినవాడు తంబురా, భజనచెక్కలు, చెంబూ వెలుపలకు పారవేసి అతడు తిరిగి లోనికి వెళ్ళబోతుండగా, రాందాసు అతడి చేయి పట్టుకొని ఆపాడు. అతడు- "ఏంది రాందాసూ!" అన్నాడు. అంతలో నడికొప్పు గప్పున కూలింది. "ఏంలేదు నాయనా! ఇంకా ఎందుకూ లోపలికి?" అన్నాడు.

ఆ వెలుగులో అతడు రామదాసు ముఖంలోకి చూశాడు. ఆ ముఖం లో ఏ విధమైన విచారమూ లేదు. ప్రసన్నత! ఆ ప్రసన్నతను చూచి రామదాసుకు నమస్కరించాలనిపించిందాతనికి. కానీ అతడు అగ్ర వర్ణస్థుడు. చప్పున అలా నమస్కరించలేకపోయి ఊరుకొన్నాడు. పోగైనవారు చెరువులో నీటిని పోస్తున్నారు. గుడిసెంతసేపు కాల్తుంది? కాలి ఆరిపోయింది. జనం వెళ్ళిపోతున్నారు. వారిలో 'ముష్టి ముండాకొడుకు, పొయ్యి సరిగా ఆర్పలేదేమో!' అన్నాడొకడు.

"నిప్పు బయటనుండే పడింది. తడిక బిగించి మరీ నిప్పు పెట్టారు."

"పాపం అడుక్కుండే వాడి గుడిశకు నిప్పు పెట్టారు చూడు." అన్నాడు మరోవ్యక్తి.

రామదాసును వెలికి లాగినతడు యింకా అక్కడే ఉండి, "రాందాసూ! నీకు విరోధులెవరబ్బా?" అన్నాడు.

"విరోధమేముంది నాయనా! గత జన్మల్లో ఎవరిళ్ళు తగల బెట్టానో, ఈ జన్మలో నా గుడిశ తగలబెట్టాడు దేవుడు. ఇదంతా ఋణానుబంధం-తీరిపోయింది. లేకపోతే ఇన్నాళ్ళూ లేనిది ఈనాడు తగలబడడమేమిటి?"

"నీదంతా వేదాంతం రాందాసూ!"

"అదైనా పూర్తిగా రాదు. నాకేం తెలుసు, వేదాంతం మాత్రం? అంతా రామయ్య తండ్రి దయ!"

"ఆయన దయకేంగాని, ఇప్పుడెక్కడుంటావు?"

చిరునవ్వు నవ్వి, "పిచ్చితండ్రీ! ఇన్నికోట్ల జీవరాసులకు తావు కల్పించిన నా రామచంద్రుడు నాకు చోటు లేకుండా చేస్తాడా?"

"ఓహోహో!" అన్నాడు ఆ వ్యక్తి ఎబ్బెట్టుగా.

"అంతే బాబూ! చూడు-మళ్ళీ ఏర్పరచుకోగలిగినంతవరకే తగులబడిపోయాయి. ఇదిగో! ఈ మహాగ్రంథాలు ఏర్పడ్డానికి నా తరమా? నా తరతరాలవారి తరమా? అయ్యగారు యిచ్చారు కాబట్టి గాని, లేకుంటే నా జన్మలో చూడగలనా? అదిగో! ఆ తంబురా, భజన చెక్కలూ, రాగిచెంబూ. చూడు, ఎలా వెలికివచ్చి నిలిచాయో

అవన్నీ నావల్లగానివి. వెలికి వచ్చాయి. అనుకుంటాం గని అంతా ఆయన దయ. ఆయన చిద్విలాసం!"

"ఏమో నీవంతా ఒక గోలగావి, ఇప్పుడుండే తావేదా అని." అడిగాడు వ్యక్తి.

"ఏ చెట్టు నీడనో ఉంటానయ్యా, నాకేమిటి?" అన్నాడు రామదాసు నిశ్చితంగా.

"ఈ చలిలోనా?" అన్నాడు.

"చలేమిటి? అది సరేగాని, పొద్దుపోయింది. మంట ఆరిందో లేదో చూచివెళ్ళు బాబూ!" అన్నాడు రామదాసు.

"ఆరితే ఆరుద్ది. లేకపోతే తగలబడనీ. నీకెందుకు? నీ గుడిశ నీకు కాకుండా చేసిన ఈ గ్రామం ఉంటేయేం, ఊడితేయేం?"

"బాబ్బాబు! అట్లా ఎప్పుడూ అనుకోకూడదు. నా గుడిసెంత? నేనెంత? గ్రామం బావుంటే మళ్ళీ గుడిశ వేసిపెడతారు, వేసుకోవచ్చు. మనకు కష్టం కలిగిందని గ్రామాన్ని నష్టపరుస్తామా? సరే నువ్వు వెళ్ళు బాబూ! నేను మిగిలిందేమేనా ఉంటే ఆర్పి వెళ్తాను" అన్నాడు రాందాసు.

"అదిసరే, రాత్రికి తావేది? ఎందుగ్గాని రాందాసూ, రా! మా పంచలో ఈ రాత్రికుండు. రేపు సంగతి రేపు చూస్తాను" అన్నాడా వ్యక్తి.

"అలాగే వస్తాలే, పో బాబూ! - నిప్పంతా పూర్తిగా ఆర్పి." అన్నాడు రాందాసు.

ఆ ప్రక్కనే చాటుగా ఉన్నవ్యక్తి గబాలున ముందుకు వచ్చి-

"రాందాసన్నా!" అన్నాడు పెద్దగా ఏడుస్తూ కాళ్ళమీద పడుతూ.

"ఏంవిటి నాయనా?" అన్నాడు.

ప్రక్కనున్న వ్యక్తి, "ఒరి నువ్వా! సావుకారి పాలెగాడివి. ఏందిరో ఏడుస్తావ్" అన్నాడు.

ఆ ఏడ్చే అతడు ఇటూ ఇటూ చూసి, "ఓరన్నా! నువ్వు యీణ్ణి మీ యింటికి తీసుకు పోమాక. ఊరిపెద్ద చేయించినాడ్రా నాయనా! ఈ సేతులమీదుగా నిప్పెట్టినాన్రా తండ్రీ! ఇందాకటనించి

యింటన్నా. పల్లెత్తు మాటనకపోయె రాందాసు. ఇంత మంచోడి గుడి శకు నిప్పెట్టి, ఎంత పాపంచేసినాన్రా బాబూ!" అన్నాడు.

ప్రక్కనున్న వ్యక్తి గబాలున వాడి గొంతు పట్టుకున్నాడు. రాందాసు అడ్డుపడి తల నాడించాడు ఊరుకోమని.

"ఏంవిటి రాందాసూ, నాయాల్ని" అన్నాడు వ్యక్తి.

"తప్పు నాయనా! ఒద్దు, ఒదిలెయ్యి!" అన్నాడు.

పాలెగాడు ఏడుపు గొంతుతోనే. "రాందాసూ! నువ్వు మా కామంద మాటినలేదంట. నిన్ను గ్రామంలోనుండి ఎల్లకొడతారంట!" అన్నాడు.

"ఈడి బాబాయి గ్రామమా?" అన్నాడు వ్యక్తి.

"బాబూ! తొందరపడకు. నే ఉండటంవల్ల వాళ్ళకేం కష్టమో! ముష్టాణ్ణి, ఎక్కడో ఒకచోట ఉంటాను" అన్నాడు రామదాసు.

"రా రాందాసూ! నా పంచలో ఉందువుగాని!" అన్నాడు వ్యక్తి.

"ఓరన్నా! ఊరు ఊరంతా పగవుద్దిరా తండ్రీ! యవ్వారం నీకు తెలియదంలా, మా కామందు దురుమార్గుడురా, నీకు తెలవని దేముంది?" అన్నాడు పాలెగాడు.

"ఎందుకులే బాబూ! నా కోసం నీవు పగ కావటం? వెళ్ళు నాయనా, వెళ్ళు" అన్నాడు రామదాసు.

"రాందాసన్నా! ఎంతన్యాయం చేసినాను?పడుండే పచ్చిగూడు పకగొట్టినానే!" అన్నాడు పాలెవాడు ఏడుస్తూ దిగులు దిగులుగా....

"నీ తప్పేంలేదు వెళ్ళుబాబూ" అన్నాడు రామదాసు.

ఆ ఇద్దరూ చెరోవంకకు వెళ్ళిపోయారు. ఆ రెండవ వ్యక్తి ఎంతగానో బ్రతిమాలాడు, రామదాసు రానని చెప్పాడు. ఇంక ఎంతటికీ ప్రయోజనం లేదని అతడు నిరాశగా వెళ్ళిపోయాడు.

రామదాసు ఆ తెల్లవారేవరకు ఆరిన గుడిశ రాజుకోకుండా నీరు పోస్తూ, దానివంక చూస్తూ అలాగే కావలి ఉన్నాడు.

తెల్లవారింది. మామూలుగా రామదాసు స్నానంచేసి తిరుచూర్ణం నామం లేకపోవడంతో ఆలోచిస్తూ తగులబడిన చోటంతా వెదుకు తున్నాడు, రాత్రి కప్పుకూలి పడిపోయినప్పుడదంతా ఎందులో కలి సిందో, పోసిన నీళ్ళకు ఎలా కరిగిపోయిందో!

అప్పటికే ఊరు పెద్దలు కొందరు వచ్చి అక్కడ నిలచి చూచారు. రామదాసు వారికి నమస్కరించాడు. ఊరుపెద్ద ముందుకు వచ్చాడు—

"నేను చెప్పలేదా రాందాసూ! ఊరంతా ఓ కట్టుగా ఉంది. నీవటు వెళ్ళవద్దని." అన్నాడు.

రాత్రి అతని పాలెగాడు చెప్పింది రామదాసు మనసులో మెదలనే లేదు.

చిరునవ్వు నవ్వుతూ, "గోచికన్నా గొప్ప దరిద్రమా బాబూ! పోనీయండి. ఆ రామయ్య దయవల్ల ఆ విప్పు ఆ ప్రక్కా. ఈ ప్రక్కా వాముల్లో పడింది కాదు. నోరులేని జీవాల నోటి దగ్గరి గడ్డి పోయేది" అన్నాడు రామదాసు.

అది ఊరు పెద్ద గుండెలకు నాటింది కానీ, అది తనకేమీ చెందని దానిలా—

"ఏమో రాందాసూ! నీన్ని గ్రామంలో బ్రతకనిస్తారన్న ఆశ నాకు లేదు." అన్నాడు.

"అడుక్కునేవాడి కరవయ్యారూళ్ళు బాబూ! మనిషి చెడగొడితే చెడతాడా మనిషి, దేవుడు చూడాలిగాని. శివుడాజ్ఞ లేనిదే చీమైనా కదలదు. ఏమో రామయ్య దయ! ఆయనేం చేయాలనుకుంటున్నాడో! ఈ రోజు స్వామి తిరుపాదాలు పెట్టుకోడానికి తిరుపార్ణం కరువు చేశాడు. వస్తా బాబూ!"

అని బయలుదేరాడు. తోమిన చెంబు నెత్తి మీద ఉంది. చేతిలో తంబురా. కుడిచేతిలో భజన చెక్కలు. కట్టుసంచి మాత్రమే ఉంది. తాటాకు గ్రంథాలు రాగి చెంబులో ఉన్నాయి.

తంబురా టంగు టంగు మన్నది.

భజన చెక్కలు ఫెళ ఫెళ మన్నాయి.

అతని గొంతు "హే రామచంద్ర ప్రభో!" అంది. అతడు నిర్వికారంగా ఉన్నాడు ప్రశాంతమైన మోముతో.

ఊరు పెద్ద మోము సూర్యకాంతి పడి, నల్లగా ఉంది.

తంబురా "దేవుణ్ణి నమ్మాడు" అంది.

భజన చెక్కలు "నిజం నిజం" అన్నాయి. ఆ మాటలు ఊరు

పెద్దకు, అక్కడున్నవారి గుండెల మీద కదం త్రొక్కాయి. అందరికీ "ముష్టాడి కెంత పొగరు!" అనిపించింది. వెంటనే "పాపం వాడేం చేసాడు-మరో మాట లేకుండా వెళ్ళిపోతున్నాడు." అన్నది ఎవరి అంతరాత్మ వానితో. కానీ దానిని ఎవ్వరూ వెలికి తెలియనీయలేదు.

రామదాసు మాత్రం అలాగే అంగడిదగ్గరకుపోయి, "అయ్యా! నలుసంత తిరుచూర్ణం" అన్నాడు.

అంగడిలో సెట్టి అతనివంక చూచి, "రాందాసూ! నీ గుడిసె తగులబడిందా?" అన్నాడు.

"ఆ. రాత్రి కాలిపోయింది బాబూ!" అన్నాడు రామదాసు.

"ఎవడా నిప్పు పెట్టినవాడు?" అన్నాడు.

"ఎవరో ఎందుకు పెడతారు! ఆ రామయ్యే తండ్రి తనిల్లు తను కాల్చుకున్నాడు. నాకేం!" అన్నాడు.

సెట్టి 'అన్నన్నా' అన్నాడు నాముూ, తిరుచూర్ణం ఎత్తి చేతిలో వేస్తూ. అది తీసుకొని పక్కింట్లో నీటిచుక్క వేసుకొని, రంగరించి నామాలు పెట్టుకున్నాడు. ఆ నామాలు పెట్టుకోగానే, హనుమంతునిలో బలం వచ్చినట్లుగా, మోర పైకెత్తి చెక్కలు వాయించుకొంటూ పాటందుకున్నాడు.

ఆ పాట యీతనికన్నా ముందుగానే, పక్కనున్న తండాలోనికి చేరింది. కానీ అతడు మామూలుగానే ఏరుదాటి లంకకు వెళ్ళి, లంకంతా తిరిగి ఆవల ఊళ్ళకు వెళ్ళి, అటునుండి తిరిగి మళ్ళీ కొండ క్రింద తండాకు వచ్చి, తండాలో నిలిచాడు పాడుతూ.

తండా నాయకుడు - అతనికి సరిగా తెలుగు రాదు. సరిగా వాళ్ళ భాష కూడా రాదు. భాషకాని భాషలో కొన్నాళ్ళుంటే అక్కడ పుట్టిన తరాలవారికి అటు అదీ, ఇటు యిదీ సరిగా అబ్బదు. అలాగే మరో తరంవరకూ వేచివుంటే ఆ తరం ఈ భాష వాళ్ళు కాదన్నా నమ్మరానంత స్వచ్ఛంగా మాట్లాడగలుగుతారు. అలాటివాళ్ళను ఎందరినో మనం చూస్తుంటాం.

తండా నాయకునికి, తండాకు ఈ విషయం తెలిసింది. దానికి కారణం కూడా అతనికి తెలిసింది. అతడు రామదాసు వాపుకు రాగానే, వచ్చీరాని భాషతో—

"రాందాసూ! నీ యిల్లు కాలిపోయిందా?" అన్నాడు.
"ఆఁ! రాత్రి కాలిపోయింది" అన్నాడు రామదాసు.
"ఎవడు చేశాడా పని?" అనడిగాడు.
"దేవుడే చేశాడు."
"అరె పోవయ్యా! దేవుడిల్లు తగలబెడతాడా? పోవయ్యా! విషయమంతా నాకు తెలుసు." అన్నాడు సుగాలి తండా నాయకుడు.
"పోనీలే! కానీ ఏం చేస్తాం? అంతా రామయ్య తండ్రి దయ. మన చేతిలో ఏముంది?" అన్నాడు రాందాసు.
"అరే, అదేమిటయ్యా! ఊరు వాళ్ళు యిల్లు తగలేస్తే దేవుడు చేశాడంటావు! నీ వెక్కడ మనిషివయ్యా?" అన్నాడు తండా నాయకుడు కొంచెం కోపంగానే. అతడు వెరవవలసిన కాలం మారిపోయింది. నేలను నమ్ముకొని తనూ, తన తండా బ్రతుకుతూంది. గ్రామం వారి అక్కరేమిటీ అన్న తీరుకు వచ్చాడు. మనిషిని మనస్సుతో కట్టివేయాలిగాని, అధికారంతో కట్టివేయలేం. ఆ జబర్దస్తీ ఎంతో కాలం సాగదు.
నిజంగానే మనిషిని మనిషి ఏం చేయగలడు? ఏమీ చేయలేడు. దేవుడు చేయగలగాలి. ఆయన తలుచుకోవాలి. అప్పుడే మనిషి ఆటలు సాగేవి.
"నువ్వు నూరు చెప్పు. గ్రామం చెడిపోయింది రాందాసూ!"
"అదే మళ్ళీ బాగుపడుతుంది. అయినా చెడేమిటి, మంచేమిటి? ఇందుకేనా పిలిచావు."
"అది సరే రాందాసూ! ఇప్పుడెక్కడుంటావు?"
"అక్కడికే వెళతాను. వాళ్ళే ఏదో యిల్లు వేసి పెడతారు. వెళ్ళొస్తాను."
"ఎందుకూ. నీ కెంత యిల్లు గావాలి కనుక!" అన్నాడు సుగాలి.
"అంతా ఆ రాముని దయ! వెళ్ళివస్తాను. ఏనాటి కెక్కడ తావు చూపుతాడో నా తండ్రి."
"ఇక్కడ చూపాడనుకొని ఇక్కడే ఉండరాదూ?"
"ఎందుకు నాయనా మళ్ళీ మీకు శ్రమ! వెళ్ళి వస్తాలే" అని

బయలుదేరి గ్రామం పొలిమేరలో అడుగు మోపాడో లేదో-ఎదురుగా వూరివాళ్ళు కొందరు నిలబడి, "ఆగు!" అన్నారు.

రామదాసేమీ బెదురులేకుండా, "ఎందుకు నాయనా అంత కోపం? ఏం జరిగింది?"

"నీ వెక్కడనుంచి వస్తున్నావు?"

"అలా నాలుగూళ్ళూ తిరిగి అడుక్కొస్తున్నాను బాబూ!"

"కొండక్రింద కెళ్ళావా, లేదా?"

"అక్కడనుంచే వస్తున్నాను బాబూ!"

"అక్కడికెళితే యిక్కడకు రాకూడదు."

"నేను అడుక్కుతినేవాణ్ణి బాబూ"

"ఏది ఏమైనా సరే! నీకిక గ్రామంలో తావరం లేదు!"

రామదాసేమీ తొణకలేదు. "బిచ్చానికి కూడా రాకూడదా బాబూ?" అనడిగాడు.

"అక్కడ అడుగుపెట్టిన ఈగకూడా ఇక్కడ వాలడానికి వీల్లేదు."

రామదాసు చిరునవ్వు నవ్వాడు.

"ఏంరా నవ్వుతావు?" అన్నాడు ఒకతను.

"ఏం(వ)ిటోలే బాబూ! వస్తాను. రామయ్య తండ్రి మిమ్మల్ని చల్లగా చూడాలి" అని బయలుదేరాడు.

ఆ నిలచిన వాళ్ళందరికీ ఏదో తక్కువైనట్టుగా బాధ కలిగింది. కయ్యం పెరిగి, రామదాసును కొట్టి తరిమినట్లయితే తృప్తిగా ఉండేది. కానీ, వాళ్ళు ఒద్దు అనగానే అతడు వెనుదిరిగాడు. తగాయిదా లేక పోయేప్పటికి వారికి తృప్తిలేదు. వారనుకున్నది-"ఈ గ్రామం మీదేం కాదు. అందరిదీను. మీరెలా ఉంటున్నారో నేనూ అలా ఉంటాను. ఊరు మీకెంతో నాకూ అంతే." అని ఇలాగే ఏదేదో అంటాడనీ, వాదులాడి, తన్ని తరిమివెయ్యాలనీ వారి వూహ. కానీ అదేమీ జరక్క పోయేప్పటికి ఏదో తక్కువతనంతో రాందాసే గెలిచినట్టు, వారే ఓడి నట్టుగా అనిపించింది వారికి.

నిర్విచారంగా చెక్కలు కొట్టుకొంటూ సాగిపోయాడు మరో దిక్కుకు రాందాసు. అతడు వెళ్ళిపోయినా, పాట మాత్రం వినిపిస్తూనే ఉంది.

మూడు రోజులు జరిగిపోయాయి. మూడవనాడు మామూలుగా రాందాసు తండాకు వచ్చాడు. తండా నాయకుడు రాందాసును చూచి—

"రాందాసూ! నామాట విన్నావుగాదు. ఎక్కడుంటున్నావు?"

"ఆ కొండలో ఒక తావు చూచుకున్నాను."

"కొండలోనా? ఏం రాందాసూ! మేమంతా చచ్చామా? కొండల్లో కోనల్లో ఉండడానికి నీకేం గతి పట్టింది? నే నానాడే చెప్ప లేదా?" అన్నాడు అమాయకంగా మొహంబెట్టి.

"ఎక్కడైతేయేం, ఉంటున్నాగా!"

"కొండలోనా! ఒద్దు. ఏ రాత్రో ఏ చిరతో నిద్రపోతుండగా నంజేస్తే ఓక్కా. మొక్కా? ఒద్దు రాందాసూ! ఒద్దు. సాయంత్రానికి నీకు యిల్లేసి పెడతాగా! రా! యిక్కడే ఉండు. మాకు తోడుగా ఉంటావు" అన్నాడు లంబాడీ.

"నేనిక్కడుంటే యిబ్బంది ఒకటుంది. నీవు ఆలోచించడం లేదు. వాళ్ళు వెళ్ళకొట్టారు. యిక్కడ చేర్తాను. నాకేం కాదు. దీనితో మరీ కక్షలు పెరుగుతాయి. వాళ్ళాశ్రయమిచ్చేవాళ్ళా-అని మీ మీద వారికి పగ పెరిగిపోతుంది. ఆలోచించు" అన్నాడు రామదాసు.

"ఐదా!.... పెరగనీ రాందాసూ! యిప్పుడు తక్కువగా ఏముంది? అప్పుడెక్కువయ్యి చేసేదేముంటుంది? నువ్వు ఇక్కడ కొచ్చావంటేనే వెళ్ళకొట్టారే, యింకా వాళ్ళు ఉద్దరించేదేముంది? ఎవరి పనులు వాళ్ళు చూచుకొంటూ ఎవరి పొట్ట వాళ్ళు పోసుకుంటున్నాం. ఒకరి కొకరు దడిచేదేమిటి? అదే కాదు. మా మూలాన కదా నీ గుడిశ పోయిందీ. నీవిట్లా కొండల పాలయిందీను. నీవు మా మాట వినాలి. వచ్చిన దెలాగూ వచ్చింది. ఇక లాభం లేదు రాందాసూ!" అని రామదాసు మాటకు చూడకుండానే తనవారందరినీ పిలిచి వారి భాషలో-వారితో, "రామదాసుకు మనం గుడిశ వేసిపెట్టాలి. జరిగిన దంతా మీకు తెలుసుకదా?" అన్నాడు.

అంతా విప్పారిన ముఖాలతో "సరే సరే." అన్నారు.

రామదాసు "ఎందుకులెస్తురూ!" అన్నాడు. అప్పటికీ వారెవ్వరూ వినలేదు. రామదాసలా నిలబడే ఉన్నాడు. గబగబా నలుగురూ నాలుగు గోతులు తీశారు. ఆ ప్రక్కా. ఈ ప్రక్కా వారిళ్ళకోసం

తెచ్చిన గుంజలు నాటారు. తలొక పక్కకీ పూనుకున్నారు. చాకిరీ కల వద్ద మనుష్యులు కదా! తలా ఒకటి తెస్తున్నారు. అడా మొగా తేడా లేదు.

తండా నాయకుడు "వెళ్లిరా రాందాసూ! సాయంత్రానికి నీ ఇల్లు తయారు. నీవు ఇక్కడే ఉండిపో" అన్నాడు.

"అంతా రామయ్య దయ. కానీ....ఏనాటి కెక్కడ ఎలా రాసి పెట్టాడో!" అని తల ఊపుతూ, తంబురా మీటుతూ బయలుదేరాడు. "రాందాసూ. సాయంత్రానికి సరాసరి ఇక్కడికే రా! అంతా అయి పోతుంది. ఇంకెక్కడికీ వెళ్లకూ!" అన్నాడు తండానాయకుడు.

"అం అం!" అన్నాడు రాందాసు.

ప్రొద్దు వాటారే వేళకు రామదాసు తండాకు చేరాడు. రామ దాసు అల్లంత దూరాన ఉండగానే తండాలో పసివారంతా అతని చుట్టూ చేరి గోల గోలగా లాక్కు వచ్చారు. అమాయక హృదయాలు. వారికేం తెలుసు! పెద్దలు "రామదాసు వస్తాడు. ఆ క్రొత్త ఇల్లు అత నిదీ," అన్నారు. పిన్నలంతా విన్నారు. ఏమిటో సంతోషం! ఏమిటో ఆనందం! మంచి హృదయాలకు, అమాయక హృదయాలకు ఆ లంగరు అనాదినుండీ ఉంది కాబోలు. అది హృదయానికీ హృదయా నికీ గల సంబంధం.

రామదాసు వారికేం ఈయగలడు! అతని దగ్గర ఏమున్నది ఈయడానికి?....ఉన్నది హృదయమే - ఈయగలిగిందీ ఇచ్చేదీ అదే అతడు.

అంతా అతన్ని లాక్కువచ్చి, అతనికని వేసిన ఇంట్లో ఉంచారు. ఆ యిల్లు మొదట్లో ఉంటుంది. మిగిలిన ఇళ్ళన్నీ లోప లుంటాయి. ఆ యిళ్ళకు ఒక వరుస ఒక క్రమం లేదు. ఎక్కడ ఖాళీ ఉంటే అక్కడ వేశారు. ఇళ్ళన్నీ కలిసి ఉంటాయి కూడలిగా. ఏ ఇంట్లో ఎవరుండేది కూడా ఎవరికీ తెలియని రీతిలో ఉంటాయి. రామదాసు అక్కడికి రాగానే అంతా వారివారి ఇళ్ళల్లోనుండి వచ్చారు. తండానాయకుడు వెలికి వచ్చాడు. వాళ్ళ గురువు కూడా దగ్గరకు వచ్చాడు. అంతా కలిసి రామదాసును యింటిలోనికి వెళ్ళి, చెంబు పెట్టి రమ్మన్నారు. రామదాసు వారి సంతోషానికి, సంబరానికి లోలోన

ఆశ్చర్యపోతూ, ఆనందపడుతూ లోపలికి వెళ్ళి చెంబూ భజన చెక్కలు, తంబురా పెట్టి వెలికి వచ్చాడు. అంతా సంతోషంగా అతని వంక చూచారు. ఆ తర్వాత తండా నాయకుడు "రాందాసూ! ఒక పాట పాడు" అన్నాడు.

"రోజూ వినేదేగదా!" అన్నాడు రామదాసు.

"అట్లాకాదు. ఇప్పుడు నీ ఇంటి ముందు అరుగు మీద కూర్చుని నీవు పాడాలి." అన్నాడు తండానాయకుడు.

"సరే దానిదేముంది!" అని లోనికి తంబురాకొరకు వెళ్ళబోయాడు.

"ఆఁ ఆఁ, నువ్వుండు. నువ్వు కూర్చో. జిలానీ! జిలానీ!" అని పిలిచాడు. ఒక పన్నెండేళ్ళ పిల్ల ముందుకు వచ్చింది. ఆ పిల్ల చాలా అందంగా, బావుంది.

"అమ్మాయ్! లోపలకు వెళ్ళి, దీపం వెలిగించి తంబురా- రాందాసు మోగిస్తాడే, అది తీసుకొనిరామ్మా" అన్నాడు.

ఆ అమ్మాయి వెళ్ళి ఇంట్లో దీపం పెట్టి తంబురా తీసుకొని వచ్చింది. ఆ తంబురా తండా నాయకుడు అందుకొని అందించాడు. రామదాసు దానిని తీసుకొని పాటందుకున్నాడు.

రామదాసు పాటనాపి చిరునవ్వు నవ్వి, "నేను పాడేదంతా నీకు అర్థమౌతుందా?" అన్నాడు.

"ఎందుక్కాదు? అంతా తెలుస్తుంది. అంటే నువ్వన్నంత బాగా మేము భాషలో మాట్లాడలేము," అన్నాడు తండా నాయకుడు

అప్పటికి పొద్దు పూర్తిగా వాలిపోయింది. ఎర్రని రంగద్దుకొని పడమటి దిక్కు కనిపిస్తూంది-రామదాసుకు ఆశ్రయమిచ్చినందుకు గ్రామం వాళ్ళు కళ్ళెర్రజేసిన తీరుగా.

మబ్బు లటూ యిటూ తిరుగుతున్నాయి-లంబాడీల రాయ బారుల్లా. ఆ యెర్ర రంగు వాటిమీద కూడా అంటుతూంది.

లంబాడీల నాయకుడు రామదాసును చూస్తూ, "రామదాసూ! మా జిలానీకి నీ పాటలు నేర్పు!" అన్నాడు.

"దానికేం? నా సొత్తు అందరికీ నేర్పుతాను. ఎవరు నేర్చు కుంటానన్నా నేర్పుతాను. నా రామయ్య తండ్రిని ఎందరు కొలిస్తే కాదంటాడు?"

"నిన్న గ్రామంవాళ్ళ ఎలా ఒద్దన్నారయ్యా!" అన్నాడు తండా నాయకుడు అతని వంకకు చూస్తూ.

"తండ్రులు, వారిష్టం! వారికలా బుద్ధి పుట్టించాడు రామయ్య తండ్రి. వారు ఒద్దన్నారు. ఏనాటికెలా జరగాలో! జీవుడు ఏనాడు ఎలా ఉండాలో అలాగే వెళ్ళ మార్చుకోవాలి. మనదేముంది? నిమిత్త మాత్రులం. అంతా జరిపేవాడు ఆయన. ఆయన గీటు దాటగలమా?"

"వెళ్ళగొట్టమని రాముడు చెప్పాడా గ్రామస్థులకు?"

"అదేమిటలాగంటావు! నిన్న యిల్లువేసి పెట్టమని మాత్రం రామయ్య తండ్రి సరాసరి వచ్చి చెప్పాడా? నీకు కలిగించినట్లే వారికీ కలిగించి ఉంటాడు. అంతే నాయనా!"

"ఏమో, అన్నింటికీ అలా సర్దుకుపోతుంటావు రాందాసూ నీవు!" అన్నాడు తండా నాయకుడు.

"సరిపుచ్చుకోవడం కాదు. అంతా ఆయన దయే!"

"మా రొట్టెలూ, అన్నం తింటావా రాందాసూ?" అని అడిగింది తండా నాయకుని కూతురు జిలాని.

"ఎందుకు తిననూ? నా రామచంద్రుడు, శబరి యెంగిలి తిన్నాడు. ఆయనకే లేని భేదం నాకా?" అన్నాడు.

"ఆ శబరి సంగతేమిటి రాందాసూ?" అని అడిగారంతా.

ఆ సాయంత్రం ఆ శబరి కథ చెప్పాడు చాలాసేపటివరకూ.

ఆ తర్వాత అంతా ఎవరి గుడిశల్లోకి వారు వెళ్ళిపోయారు. తండా నాయకుడు, జిలానీకూడా వెళ్ళిపోయారు.

లోపల చెమ్మ నేలమీదే గుడ్డ పరచుకొని, రామదాసు పడుకో బోతుండగా తండా నాయకుని కూతురు జిలానీ ఒక గోతం తెచ్చి యిచ్చి దానిమీద పరచుకొని పడుకోమని చెప్పింది.

అతడు మారుమాట లేకుండా ఆ యిచ్చిన దానిని పరచుకొని. తన పంచా పరచుకొని ఆ రేయి నిద్రపోయాడు.

ఆ మరునాడు తిరిగి మామూలుగానే ఉదయాన్నే లేచి సంచారానికి బయలుదేరబోతూ, చుట్టూ చూచుకున్నాడు. అంతా క్రొత్త ప్రదేశం. తనలో తాను "ఎంత మార్పు! నాలుగు రోజులనాడు, గ్రామంలో గుడిశలో ఉన్నాను! తర్వాత రెండు రోజులు కొండల్లో

ఉన్నానా! ఈ రేయి ఇక్కడ గడిపానా! ఓ రామయ్య తండ్రీ! ఏమిటి నీ మాయ? ఎక్కడెక్కడ కాలం గడపమని తలచావు తండ్రీ!" అనుకొని తల ఒకసారి ఊపి రామనామ సంకీర్తనతో గుడిని వదిలాడు.

భజన చెక్కలూ, తంబురా, రాందాసు గొంతూ లంబాడీ తండాను మేల్కొల్పింది.

రోజూ వారావేళకు నిద్ర మేల్కొరు.

కానీ ఆనాటినుండి రోజూ వేకువనే లేచేవారు. అతని గొంతు వారిని నిద్ర మేల్కొల్పేది.

లంబాడీలు నిద్ర మేల్కొన్న రీతిగా, ఈ లోకం అతని పాటలకు కామక్రోధ మద మాత్సర్యాలనే మత్తు నుండి మేల్కొన్నట్లయితే ఎంత బావుండేది!

రామదాసు నిద్రనుండి శరీరాన్ని మేల్కొల్పగలిగాడు గాని, నిద్రపోయే ఆత్మలను మేల్కొల్పలేకపోయాడన్న మాట!

లేకుంటే వీరంతా ఇలానే ఎందుకుంటారు?

ఎందరెందరో మహానుభావులూ, మహాత్ములూ మేల్కొల్పలేకపోయారు. ఒక్క దాసరివల్ల అవుతుందా-వీరి మత్తు వదిలించడం? కాదు. బహుశా వీరికీ మత్తు, ఈ నిద్ర ఉండబట్టే బ్రతుకుతున్నారు. సృష్టి నడుస్తూంది. లేకుంటే ఈ లోకం మరోలా ఉండేదే!

—అంటూ ఆకారం లేని ఆమె చెప్పుకుపోతూంది రామదాసు కథను. నేను వింటూ అలాగే చాలాసేపు వున్నాను.

అప్పటికి చందమామ పడమటి కొండమాటుకు వెళ్ళాడు. నేనలా నాలుగు దిక్కులూ చూడడంతో—

"బాగా ఆలస్యమైంది కదూ?" అనడిగింది.

"అయితే అయిందిలే. చెప్పు!" అన్నాను నేను.

"కాదు. కోళ్ళు కూస్తున్నాయి. వెళ్ళు." అన్నది.

"అదేమిటీ సగంలో!" అని ఏదో అనబోయాను.

"మళ్ళీ రేపు రా! ఉంటావుగా?" అన్నదామె.

"ఉంటాను." అన్నాను నేను.

"సరే వెళ్ళిరా!" అంది.

"నీ పేరు? రేపు వచ్చి ఏన్నెలా పిలవాలి?" అన్నాను.

సమాధానం రాలేదు.

నా ప్రక్కనుండి కడియాలు, గట్టి గాజులు వెళ్ళిపోతున్నట్టు సద్దు వచ్చింది.

సద్దు వినిపించినంతసేపూ అటు చూచాను. ఆ సద్దు సరిగ్గా అక్కడ ఎత్తుగా ఉన్న రాయి దగ్గరకు వెళ్ళి ఆగిపోయింది.

"రాందాసూ! ఈనాటికి వచ్చాడు నీ కథ ఆలించడానికో మనిషి!" అంది ఏడుపు గొంతుతో.

"నేను వెళ్ళి వస్తాను. రేపు తప్పకుండా వస్తాను." అని కేక వేశాను.

సమాధానం రాలేదు.

కాళ్ళీడ్చుకొంటూ బయలుదేరాను.

నేను కాలువ దాటుతూండగా యిద్దరు ముగ్గురు రైతులు ఎదురయ్యి—

"అయ్యా, చాలా పెందరాళ లేచినట్లున్నారు." అన్నారు.

విద్రపోని నంగతెలా చెప్పేది?....

# 3

మరునాడు మధ్యాహ్నం రాత్రి వెళ్ళిన చోటుకు వెళ్ళి చూచాను.

నాకేమీ కనిపించింది కాదు.

నేను కూర్చున్న చెట్టుక్రింద నిలచాను.

కొంచం దూరంగా, రాత్రి వెన్నెల్లో కనిపించిన రాయి వుంది. అది కొండమీదకు వెళ్ళే దారి. దారికి ప్రక్కగా ఆ రాయి. అంతకన్నా మరేమీ లేదు.

ఆల గాచే కుర్రాళ్ళు దారికి దిగువగా ఆడుకుంటున్నారు.

ఆలమంద ఆ ప్రక్కనే పచ్చిక మేస్తూంది. దానికానుకొని

ఏరు మలుపు తిరిగే చాలు కనిపిస్తుంది. నీరు లేదు కాబట్టి, ప్రస్తుతాని కేమీ కనిపించడంలేదు.

ఎండ మిటమిటలాడిపోతూ వుంది.

కాసేపు అటూ యిటూ చూచి, తిరిగి వచ్చేశాను.

గ్రామం వదిలి నాకు తెలియకుండా చాలా దూరం వచ్చాను రాత్రి. ఆలోచించుకుంటూ, రాత్రి నేను మాటాడిందెవరితో? ఏమిటి? అని ప్రశ్న వేసుకున్నాను.

సమాధానం రాలేదు.

ఆ తర్వాత ఎప్పుడు పొద్దుపోతుందా అని కాచుకోనున్నాను.

రాత్రి నేను వెళ్ళినట్టు ఎవరికీ తెలియలేదు. అదొక విచిత్రంగా వుంది నా వరకు నాకు.

విసుగ్గా వుంది సంధ్య.

నా మనస్సు మరో వంక వుండడంవల్ల ప్రకృతి వింత వింత వేషాలు నాకు వికృతంగా కనిపించాయి.

అనుకున్నట్టు ప్రొద్దుపోయింది.

వెన్నెల కొంచం ఆలస్యంగా వచ్చింది. వెళదామా అనుకుంటున్నాను.

నిన్నటిలాగా ప్రొద్దుపోయింది.

వూరు మాటుమణిగింది.

పాట కూడా వినిపించింది.

అదిగో అదే గొంతు.

అదే పద్ధతి.

నిలవలేకపోయాను.

సరాసరి కాలువ దాటి వెళ్ళాను.

ఆ రాతి దగ్గరకు వెళ్ళాను.

ఎక్కిళ్ళు వినిపించాయి ఏడుస్తున్నట్టు.

"వుంటావో, ఉండవో! అని వచ్చాను" అన్నాను నేను.

"నేనెక్కడకు పోతాను, రా! వెళ్ళి అక్కడ కూర్చుందాం." అన్నది ఆ గొంతు. అంటూనే నడక సాగించింది.

అదే సద్దు.

అదే మోత.

సరిగ్గా నిన్నటి జా.గాలోనే ఆగిపోయింది.

నేను వెళ్ళి కూర్చున్నాను—

"నిన్న అతడు తండాలోనికి చేరేంతవరకూ చెప్పానుకదూ! ఇక విను!" అని తిరిగి మొదలుపెట్టింది.

"రామదాసు దాదాపు తండావారి మనుషుల్లో మనిషిగా మారి పోయాడు."

నేను మధ్యలో అడ్డు తగిలి, "యింతకూ నీ వెవరో చెప్పనే లేదు!" అనడిగాను.

"చెపుతాను. త్వరపడతావేం? ఇక వచ్చే కథంతా నాదే! నా మూలానే అతనికా గతి పట్టింది. నేనే కారణం. విను!" అన్నది. ఆమె వదిలిన నిట్టూర్పు- అది నిట్టూర్పుగానే అనిపించింది. కాక పోయినా పోవచ్చు. - నేను అలా ఊహించానేమో. ఆమె మొదలు పెట్టింది—

రామదాసు తండాలో కలసిపోయాడు. అతనిని గ్రామాల్లోని వారంతా "లంబాడోళ్ళ రాందాసు" అని పిల్వడం మొదలుపెట్టారు.

ఆనాడు తండావాళ్ళు రామదాసుకు ఆశ్రయమిచ్చారని గ్రామం లోని వారికి కిన్నెరగానే వుంది.

ఏ కారణం దొరుకుతుందా అని అందులోని వారు ఎదురు చూస్తున్నారు.

ఏ చిన్న కారణం దొరికినా లంబాడీలను తగాదాలకు పురి గొల్పుతున్నారు.

నాయకుడు చాలా ఆలోచనగల వ్యక్తి. బ్రతకనేర్చినవాడు కావటంతో వారు గిల్లి కజ్జా పెట్టుకుంటున్నారని తన వారిని గదమా యించడం మొదలుపెట్టాడు. "మీరు ఏది జరిగినా పట్టించుకోకండి. ఒకనాడు వస్తుంది. ఆ నాటికి అంతా సిద్ధంగా వుందాం." అన్నాడు.

అదే విషయాన్ని రామదాసుండగా కూడా ఒకసారి తండాలో వాళ్ళు ముచ్చటించారు.

అంతా విని రామదాసన్నది—

"నేను అనదే అన్నాను. మీరు విన్నారా? వినలేదు. ఇంక

మీరు బ్రతికున్నంతకాలం గ్రామంవాళ్ళు మిమ్మల్ని వేధిస్తారు. మించి పోయింది లేదు. నేను నా దారిన వెళ్ళి, ఏ గ్రామంలోనో తలదాచు కుంటాను." అన్నాడు.

దానికి నాయకుడు "ఇక్కడంత చేవ చచ్చిలేరు రాందాసూ! అవసరమైతే ప్రాణాలు వదిలేస్తాం." అన్నాడు.

"అదే వద్దంటున్నది. విలువలేని నా కోసం విలువైన ప్రాణాలు వదలడం ఎందుకయ్యా? రామయ్యతండ్రి దయవల్ల అన్నీ సర్దుకుపోతాయి. నేను తప్పుకుంటే." అన్నాడు రామదాసు.

"కాదు రాందాసూ! తండాకూ, ఊరి వాళ్ళకూ తగాయిదా నీ మూలాన రాలేదు కదా! వాళ్ళకూ మాకూ వున్న తగాయిదా నీ ఇంటికి నిప్పు పెట్టి నీకు నిల్వనీడ లేకుండా చేసింది." అన్నాడు తండా నాయకుడు.

"ఏమిటో బాబులూ! ఏది న్యాయమో ఏదన్యాయమో, వివరం తెలియకుండా వుంది. ఎవరుమాత్రం ఏం చేస్తాం. ఎవరిదీ తప్పు కన పడదు. తగాయిటా ఆగిపోదు. గడ్డివామిలో నిప్పు పడ్డట్టు కుమిలి పోతుందిగాని మరోటి జరగడం లేదు. పాపం, పుణ్యం తెలిసిన రామయ్య తండ్రి మీ అందరినీ కాపాడాలి. తప్పకుండా కాపాడతాడు. ఆయన దయామయుడు కదా, ఊరుకుంటాడా మరి." అన్నాడు రామ దాసు. అతడు లోలోన చాలా బాధపడుతున్నాడు.

అతడు ఏం బాధపడినా ఏమిటి ప్రయోజనం?

అతన్ని లెక్కచేసే వాళ్ళెవళ్ళున్నారు?

అతనంటే గౌరవం ఉంది. అందరు ముష్టివాళ్ళనూ చూచి నట్టు అతన్ని చూడరు. అతనికున్న ప్రత్యేకత అతనికుంది. ఒక్క ఈ విషయంలో మాత్రం అతని మాట ఎవరూ విన్నారుకాదు. దానికి కారణం గూడా అతడు తండా వదలి పోతానన్నవరకు మాత్రమే. అప్పటికంతా ఊరుకున్నారు.

రామదాసు మామూలుగా తన గుడిశలోనికి వెళ్ళాడు.

తండావాళ్ళంతా ఎటు వాళ్ళటు సర్దుకున్నారు.

నాయకుడు గుడిశ ముందున్న ఖాళీ స్థలంలో కూర్చుని "రాందాసూ!ఏదన్నా పాడు. రోజూ ఉండేదేగా, ఈ గొడవ." అన్నాడు.

"అప్పటికే రాందాసు తంబురా చేత పట్టుకొనున్నాడు.

అతడికిలాటి విషయాల్లో ఏం కష్టం కలిగినా రామునికేదో చెప్పుకోవాలనే అనుకుంటాడు.

అదతనికి మొదటినుండీ వున్నదే.

తండానాయకు దడిగిందే తడవుగా రామదాసు గొంతెత్తి పాట పాడసాగాడు.

ఆ పాట వింటూ తండా నాయకుడు తలగుడ్డ పరచుకుని అక్కడే నిద్రపోయాడు.

అతని కూతురు జిలానీ అక్కడున్న అరుగుపైన గోడ కానుకొని గుడ్డి దీపం వెలుగులో మోగన్ను పెట్టి ఆలపించుతూ అతని వంకే చూస్తుంది.

రోజురోజుకూ ఆమె మనస్సు రామదాసు పైదకు కొత్త నీటి యేటిలా ఎదిగిపోతూ వుంది.

రామదాసుకూ, తండావారికీ పంటకొచ్చే చేని పదనులాగా పచ్చరంగు ఎద్దడిలాగా ప్రాకి ప్రాకి. తేడా తెలియనీయడం లేదు.

ఆ తర్వాత నిద్రపోతున్న తండ్రిని లేపుకొని ఆమె తమ గుడిశకు వెళ్ళిపోయింది.

ఇలాగే చిన్నచిన్న తగాయిదాలతో పల్లెవారికీ, తండావారికీ తగాయిదా పెరిగి కక్షలు ఎదిగిపోతున్నాయి.

రామదాసు కిదేమీ పట్టలేదు.

మామూలుగా సంచారానికి వెళ్ళిపోయేవాడు.

రోజులా ఆ నాడు కూడా రామదాసు వేకువగానే లేచి ఏటికి వెళ్ళి స్నానంచేసి, తన చెంబు తోముకొని మెల్లగా గుడిశకువచ్చి తిరుచూర్ణం మోము నద్దుకొని చెంబూ, భజన చెక్కలు, తంబురా తీసుకొని "ఓ రామచంద్ర ప్రభూ!" అని, "ఏమయ్యా! రామయ్యా!" అంటూ బయలుదేరాడు.

తండావారంతా లేచి ఎవరి పనుల్లోనికి వారు వెళ్ళిపోయారు.

మిట్టమధ్యాహ్నపు సూర్యుడు నడినెత్తికెక్కి వచ్చాడు.

లోకమంతా యెండలో మండిపోతున్న రీతిలో ఉంది.

గ్రామంలో వున్న నలుగురూ కట్టెలు తీసుకొని తండామీదికి కారు కూతలు కూసుకొంటూ తండా గుడిశల మధ్యకు వచ్చారు.

గోలగోలగా తండాలోని పిల్లా జెల్లా ఏమంటే ఏమన్నారు.

వారలా రావడానికి కారణం ఏమీ లేదు.

తండావాళ్ళ పొలాల్లోనికి గ్రామం వాళ్ళ గొడ్లు పడ్డాయి. నాలుగైదుసార్లు తండావాళ్ళు చెప్పారుట.

ముందునాటి సాయంత్రం దైసీ చేనులో పడ్డ రెండు గొడ్లను బందెల దొడ్లో పెట్టించి వచ్చాట్ట.

అంతకు ముందు ఎన్నోమార్లు లంబాడీల ఆలమందను చేల దరిదాపుల్లో మసలినా తీసుకొని వెళ్ళి బందెలో వుంచారు గ్రామస్థులు.

రాత్రి దైసీ చేశాడని అంతా అంతులేని ఆగ్రహానికి లోనై తండామీదికి దండు బయలుదేరారు.

ఇది ఈ నాటిది కాదు బాబూ! తక్కువ వారిని ఎక్కువవారు అనాదినుండీ యిలాగే హింసించి హింసలపాలు చేస్తూ వచ్చారు. వస్తున్నారు, ఇది ఈనాడు పోదు. ఈ మానవ సంతతంతా అంతే! వారు ఎన్ని మార్లో లంబాడీల గొడ్లను అనవసరంగా బందెల దొడ్లో పడేలారు. దైసీ రెండింటిని, చేనంతా సర్వ నాశనం చేస్తే తీసుకొని వెళ్ళి వదలి వచ్చాడు, అందుకని, వారికి బలం వుందని, ఆ బలం ఉపయోగించడానికి తండామీదికి దండు వచ్చారు, ఎంత అన్యాయమో నీవే ఆలకించు.

వారి మాటలు నేను చెప్పలేను.

అవి నాల్కలు కాదు. దాదాపు తాటి పట్టలయ్యుంటాయి.

అంత అన్యాయంగా తిట్టారు.

అవి వినలేక తండావారు తిరగబడ్డారు.

యింకేముంది?

తలలు పగిలిపోయే పరిస్థితి ఎదురయింది.

అప్పటికే గ్రామస్థులు తండాలో వారి నిద్దరిని కొట్టారు.

అంతలో రామదాసు మధ్యకు వచ్చాడు-"బాబులూ! బాబులూ!" అంటూనే.

మూడోవాడిమీద విసరిన కట్టెదెబ్బరామదాసు బుజానికి తగిలింది.

దానితో తండావారికి ఆవేశం పెరిగింది. నాల్గు ప్రక్కలా దొమ్మిలాగా తోసుకొని వచ్చారు. రామదాసు తంబురా పడిపోయింది. చెంబూ, చెంబులోని గింజలు నేలపాలయ్యాయి. అది చూచిన నాయకుడు ముందుకు దూకాడు.

రామదాసు అడ్డు వెళ్ళాడు.

తన చెంబు, తన తంబురా విషయం పట్టించుకోకుండా, గ్రామస్తుని కట్టె విసరు నాయకుని మీద పడవలసింది రామదాసు తల మీద పడింది.

తల విచ్చింది.

నెత్తురు పరదయ్యింది. అప్పటికీ "రామా!" అంటూ తండా నాయకుని పట్టుకున్నాడు.

వచ్చిన గ్రామస్తులను తండా వాళ్ళంతా కలసి పెడ రెక్కలు విరచికట్టారు. వీరి స్థానం, వీరి బలగం ఎక్కువ ఉంది. అందువల్ల గ్రామస్తులను కట్టివేశారు.

తనకు తగిలిన దెబ్బ లెక్కచేయకుండానే అలాగే నిలచి, నాయకునిచేత వప్పించి, ఆ నలుగురనూ విడిపించి రామదాసు పడిపోయాడు.

తండావాళ్ళకు యిష్టం లేకపోయినా ఆ నలుగురనూ వదలి రామదాసును మోసుకొని వెళ్ళి, అతని గుడిశలో పారవేశారు. ఈ విషయం గ్రామానికి తెలిసింది.

గ్రామంలో చాలామంది "లంబాడీ లంజకొడుకులకింత కావరమా!" అని అంతా ఉమ్మడిగా బయలుదేరబోయారు.

గ్రామ పెద్ద అంతా విని, తప్పు తనవాళ్ళదేనన్న నిర్ణయానికి వచ్చి, అందరికీ చెప్పాడు—"మనం తండామీదికి దొమ్మికి పోవడం న్యాయం కాదు. ప్రస్తుతానికి ఊరుకోండి. తర్వాత దేనిమీదో ఒక దానిమీద కల్పించుకొని చేయవలసిన పని చేద్దాం. ఎందుకంటే అక్కడ వాళ్ళ చేను మన గొడ్ల మూలాన పాడయ్యింది. కళ్ళకక్కట్టినట్టు కనిపిస్తూంది. వినేవాళ్ళకిది కావాలని తగువు పెట్టుకున్నట్టుగా ఉంటుంది. అది మంచిదిగా"దని అప్పటికి ఆపాడా తగువును.

గ్రామ పెద్ద ఏమంత పెద్దమనిషి గాదు.

అయినా కొంచం ఆలోచించి చేసే రకం. ఏది చేసినా కాన రాకుండా చేయాలని అతని ఉద్దేశం. ఏది ఎలా సాగినా వాళ్ళకూ వీళ్ళకూ మధ్య రామదాసు తల పగిలింది.

రామదాసు నెత్తురు పంచుకున్నారు.

తాత్కాలికంగా మందులు వేసి కట్టారు.

నెత్తురాగిపోయింది.

కాని రామదాసుకేదో పత్తుగా, బాధగా ఉంది. అలాగే పండు కొనే ఉండిపోయాడు.

రామదాసుకు దెబ్బ తగిలిందని, అతడు లేవడంలేదని, రావడం లేదని ఆ కొట్టిన వాళ్ళనందరినీ పల్లెల్లో చెప్పుకున్నారు.

"పోయి పోయి ముష్టాణ్ణి కొట్టేది?"

"ఇదేం న్యాయం! అల్కా యీళ్కా కలపి అడుక్కుండేవాడి మీద పగపట్టారు!"

"ఏదేమైనా ఇంత కలా?"

"కలేమిటి! పచ్చికల్లైతే! వాడి మానాన వాడు 'కృష్ణా రామా' అని అడుక్కు తింటాడు. గ్రామస్థుల కేం పోయేకాలం?"

"అసలు వీళ్ళు వెళ్ళింది రామదాసుని కొట్టడానికే!"

"ఇంకా నయం, నలుగురునీ లంబాడీలు పెడరెక్క లిరగదీసి కట్టేస్తే-రాందాసే ఒద్దని విడిపించాడంట."

"ఆఁ ఆఁ, నిజమే." అని తలో విధంగా శివార్ల ఊళ్ళన్నీ గ్రామాన్ని విమర్శించాయి.

దాదాపు వారం పదిరోజుల వరకూ రాందాసు పడక విగలేదు.

తలకు బలమైన గాయమే తగిలింది.

కొన్నాళ్ళదాకా నెత్తిన చెంబు పెట్టుకోడానికి వీలు లేకుండా పోయింది.

అతడు ప్రక్క దిగనంత కాలం జిలానీ కంటికి రెప్పలా కాపాడింది.

ఏ క్షణానికేం కావాలో ఆలోచించి అన్నీ సమకూర్చింది.

ఆ సేవ చేస్తూ ఏదో తెలియని సంతసాన్నందుకుంటుంది జిలాని.

అది ఒకరు ఒకరికి మనస్ఫూర్తిగా సమర్పించుకున్నప్పుడు కలిగే ఆనందం, తృప్తి.

అది చేయలేని వాళ్ళెవ్వరూ అందుకోలేరు.

అది అందుకోడానికి చాలా కష్టపడాలి.

ధనంతో రాదది.

ఆత్మ లయ గలిపి శరీరాన్నుపయోగించిన వారందుకోగలుగుతారు.

రామదాసు మధ్య మధ్య "సీతమ్మ తల్లి నీలో ఉందే" అనేవాడు.

దానికి జిలానీ ఉబ్బిపోయేది.

తండావారంతా జిలానీని రామదాసు సేవకు వదిలివేశారు.

అసలామెను ఎవ్వరూ ఏమీ అనరు.

రామదాసుకు కావలసినదంతా తండా నాయకుని ఇంట్లో నుండి జిలానీ తీసుకొని వచ్చి సకల సపర్యలూ చేస్తుంది.

తండానాయకుడు సర్వం అందించమని ఆమెతో అనేవాడు.

రాత్రిళ్ళు కూడా ఆ గుడిశలోనే ఉండిపోయేది జిలాని.

అమాయకులు, ఏమీ తెలియని పసి హృదయాలు - తండాలో వారివి.

వారికి "ఇది వయసులోని పిల్ల - ఆ రామదాసు వయసులో ఉన్నాడు-వారిద్దరికీ సన్నిహితం కలుగుతుంది - దాని పరిణామం భావికి ఏమిటా" అన్న ఆలోచన రాలేదు.

వారసలు అంత దూరం ఆలోచించరు.

ఆలోచన చేయవలసిన అవసరం ఉంటుందని కూడా వారికి తెలియదు.

వారిచ్చిన స్వేచ్ఛతో జిలాని హృదయాన్ని పెంచుకొంది.

రామదాసు కోలుకొన్నాడు.

తిరిగి మామూలు మనిషయ్యాడు.

గ్రామం వాళ్ళు అవకాశం కోసం చూస్తూ ఉన్నారు.

కాలం వారికి కలిసి రాలేదు.

అందువల్ల తిరిగి తగాయిదా రాలేదు.

రామదాసు పూర్తి ఆరోగ్యవంతు డయ్యాడని తెలిసి ఆ రాత్రి వేళ తండాలోని వారంతా పోగయ్యారు.

అందరూ జిలానినే పొగిడారు.

జిలానీ వల్లనే రామదాసు తేరుకొన్నాడని తండా జిలానీని పొగిడింది.

మరునాటినుంచి రామదాసు మామూలుగా గ్రామ సంచారానికి వెళతానన్నాడు.

తండా నాయకుడు "ఎందుకులే రాందాసూ! నాలుగు రోజు లాగు." అన్నాడు.

"అయ్యో, రామయ్య తండ్రి ఉత్తరువు నెరవేర్చవద్దా? ఇప్పటికే చాలా ఆలస్యమైపోయింది. గ్రామాల్లోని తండ్రులందరి చెవులకూ రామ నామం ఇలా అందకుండా పోయింది. అందకపోతే ఎలా?" అన్నాడు.

అది తండావారికి సరిగా అర్థం కాలేదు. "సరేలే తిట్టేనోరు, తిరిగే కాలూ ఊరుకోదంటారు." అన్నారు.

ఆ తర్వాత నాయకుడే "రాందాసూ! ఏదన్నా పాడు!" అని అడిగాడు.

ఆ రోజుకు రెండు రోజులనాడే తంబురా సరిచేసుకొని సిద్ధం చేసుకొన్నాడు.

లోనికి వెళ్ళి జలానీ తంబురా తెచ్చి యిచ్చింది. దాని నందుకొని రామదాసు గొంతు సవరించుకొని ఆ రోజు సీతాకళ్యాణంవరకూ పాడి వినిపించాడు.

తండావారంతా వెళ్ళి, వారివారి తావరాల్లో నిద్రపోతూరు.

కాలం చాలా తమాషా అయింది.

గ్రామంలో మార్పులు రాలేదు.

కాలపురుషుడు కనులు మూసుకొని ఉండిపోయాడు. ఒకోసారి ఈ కాలపురుషుడు క్షణాల్లో ఏవేవో ఎనలేని మార్పులుచేస్తాడు. తీసుకొని వస్తాడు. ఒకోసారి ఏ యిసుమంత మార్పూ రాకుండా, ఉన్నచోటే అలాగే ఒక్క అడుగైనా ముందు వెనుకలకు జరక్కుండా స్తంభించిపోయిన రీతిలో నిలిచిపోతుంది.

గ్రామమూ, తండా మామూలుగానే ఉండిపోయింది.

జిలానీకి తెలియకుండా ఆమె హృదయంలో ఏవో కోరికలు పెరుగుతున్నాయి.

వాటికి అర్థంలేదు.

అర్థరహితమైన మార్పది.

అది ఆమెకు కూడా తెలియదంలేదు.

రామదాసును చూడకుండా ఉండలేదు.

ఆ విషయాన్ని గూర్చి ఆమె ఏనాడూ ప్రశ్నించుకోలేదు.

చిన్న పిల్ల - వయస్సులో ఉంది.

ఆమె శరీరం ఏవేవో కావాలన్న సంజ్ఞలను మనసుకందజేసేది.

మనసు ఎడతెరిపిలేని ఆలోచనలను చేసేది.

ఆ ఊహలు అలా అలా తిరిగి రామదాసు ముందుకు వచ్చి ఆగిపోయేవి.

ఆమెకా తర్వాత రామదాసు తప్ప మరొకటి కనిపించేదికాదు.

సర్వం రామదాసు మయంగా ఉండేది.

ఆ విషయం ఆమెలోనే ఉండిపోయేది గాని, ఏమీ వెలికి వచ్చేది కాదు.

ఎలా రావాలి?

ఎలా వస్తుంది?

ఇంకా రామదాసుకు ఆమె చిన్నపిల్ల.

దాదాపూ ఏమీ తెలియని పసిది.

తనంటే ఏదో తెలియని మమకారం, అది సీతమ్మ ఆ పిల్లలో కలిగించింది. అంతేకాక అతడనుకుంటాడు ఒకోసారి - రామయ్య తండ్రి మాయ చేస్తాడు. గారడీ చేస్తాడు. మహా మంత్రగాడు. ఆ పిల్ల మీద నాకు వాత్సల్యాం కలిగించి, ఈ లోకంలో కట్టుబడిపోయి, ఏదీ చేయలేని స్థితికి తీసుకురావాలని, ఆయన మీద మమతను తగ్గించి ప్రశ్నలకు మనస్సును పరుగెత్తించాలని చూస్తున్నాడు. ఏమిటో ఆయన మాయ! ఎటు తిప్పితే అటు తిరిగిపోయే వాళ్ళమేగదా. ఆ బిడ్డను నాకు అప్పగించి, ఆ బిడ్డమీద మమతా, మమకారంతో నా మార్గాన్ని మార్చాలని. -

పిచ్చితల్లి! మాయలోబడి రేయింబవళ్ళూ నాకు చాకిరీ చేసింది.

నామీద ఎందుకామెకీ ప్రేమ? నేనేమవ్వా తండ్రినా, తల్లినా, అన్ననా? రామయ్యతండ్రీ! ఏమిటో నీ మాయ - అనుకుంటాడు రాందాసు.

హృదయం ఆ గాడితప్ప ప్రక్క కెప్పుడూ వెళ్ళేదిగాదు.

ఆ గాడిలోనే గానుగ ఎద్దు తిరుగుతున్న రీతిలో తిరుగుతుండేది.

గ్రామస్థులు ఈ లోపల ఊళ్ళవాళ్ళను ఆకట్టుకొన్నారు.

అందరికీ రామదాసు కొరకరాని కొయ్యగా తయారయ్యాడేమో ననిపించింది.

అది అతని మీద ఉన్న ప్రేమలోనుండి బయలుదేరిన కోపం. అది రాగవైరం.

అందరూ ఆలోచించారు రామదాసు గూర్చి.

రామదాసు తల గ్రామస్తులు పగులగొట్టారు అన్నప్పుడు అందరికీ 'అయ్యో పాపం' అనిపించింది.

రామదాసు ఆ నాల్గురోజులూ రాకపోయేటప్పటికి, ఇంక రాడేమో ననిపించింది అందరికీ. రాకపోతే ఏం అని ఏ ఒక్కరూ అనుకున్నారు గాదు.

అసలు రామదాసుకూ, ఆ శివార్లకూ ఉన్న సంబంధ మేమిటి?

అతడు శివార్లన్నిటికీ సంబంధించిన వాడు. తెల్లవారి లేస్తే అవన్నీ తిరుగుతాడు. రామనామంతో వాటిని పావనం చేస్తాడు. అతని గళంతో అందరినీ పునీతులను చేస్తాడు.

అది ఆత్మీయత.

మామూలు దృష్టికి అతను ముష్టివాడు.

వినే జనానికి, పల్లెకూ, ఆ శివార్లకూ అందనిదీ, అతీతమైనదీ, అంతర్ ప్రకృతికి కావలసినదీ అతని గళం. ఆ గళంలోనుండి వెలువడుతున్నది భుక్తికి మించినది - భక్తి - ముక్తిదాయకమైనది. అది అతడందరికీ పంచాడు; పంచుతున్నాడు.

దాని నందుకొంటున్న హృదయాలు అతన్ని కోరుకుంటాయి.

ఎందరో ముష్టివారు వస్తూ పోతూ వుంటారు.

ఆ శివార్ల వాళ్ళు అందరినీ తలంపులో ఉంచుకోగలిగారా? లేదు. వారికి తెలియనిది. వారందుకోలేనిది రామదా సందించాడు.

అందువల్లనే అందరి హృదయాల్లోనూ నిలిచిపోయాడు. కానీ బాహ్యంగా కనిపించేది, ఈ నాటకీయ జగత్తు కందనిది, ఆ ముష్టితనం ఆ ప్రాంతంవారిని కట్టి వేసింది. ఆ పరిధులు దాటి వారాలోచించ లేకపోయారు.

ఆత్మలు కోరేదాన్ని కాదని ప్రకృతి శక్తులకు కట్టుబడి అతని మీద లోపలున్న ప్రేమను ఈసడింపుగా మార్చుకొని 'ముష్టి వెధవ' అన్నారు.

అందువల్లనే అతడు కనిపించని రోజుల్లో వారి హృదయం అతని కొరకు వెదికేది.

అదీ వారికి మామూలుగా రోజూ వచ్చేవాడు రాలేదేం అని మాత్రమే.

అది అంతఃశక్తుల ప్రేరేపణతో. అప్యాయతతో నిరీక్షిస్తున్న నిరీక్షణ అని వారికేం తెలుసు?

చెప్పినా కాదంటారు. ఒప్పుకోరు.

కారణం అతడు ముష్టివాడు.

వారు ముష్టి వేసేవారు.

అతడు లోకువైన వాడు.

అందువల్ల బాహ్యప్రవృత్తికి లోనై ఈసడిస్తారు.

అంతర్ జగత్తుకు ముష్టితో గాని, ఎక్కువ తక్కువలతో గాని పనిలేదు.

అది భావిని గూర్చి యోచిస్తుంది.

అందువల్ల దాని పరిధులు వేరు.

ఏది ఏమైనా రామదాసు అంటే వారందరికీ తెలుసు.

అతని అవసరం చరమైన జడజగత్తుకు అవసరం లేక పోయినా, చిరమైన జగత్తు కవసరం. ఆ కోరే హృదయాలను మరో విధంగా మార్చుకొని అతని మీద యిష్ట భావం పూనారు అందరున్నూ.

ఎందుకూ అన్నది ఎవరూ ప్రశ్నించుకోలేదు.

అసలా ప్రశ్న వారికి రాలేదు.

వచ్చివుంటే పరిష్కారమార్గం తెలియక అల్లాడిపోయేవారే।

అతడు మామూలుగా భిక్షానికి బయలుదేరాడు. ఒక పల్లెలో ఒక యింటి ముందు నిలిచి—

"ఏమయ్యా రామయ్యా। ఎందుంటివయ్యా।" అన్నాడు. ఆ యింటి యిల్లాలు భిక్షం వేస్తూ—

"రాందాసూ। నువ్వు లంబాడోళ్ళలో కల్సిపోయావా?" అనడిగింది.

రామదాసు చిరునవ్వు నవ్వుకున్నాడు.

ఆ నవ్వు చూచి ఆమె తిరిగి "నవ్వుతావేం రాందాసూ। మరి ఊళ్ళన్నీ అలా అనుకుంటున్నాయేం?" అనడిగింది.

"ఏమిటో తల్లీ। అంతా మాయ" అన్నాడు రాందాసు.

"నువ్వెక్కడుంటున్నావ్?"

"అక్కడే తల్లీ। ఆ కొండకింద తండావాళ్ళు ఇల్లేసి పెట్టారు. అందులో వుంటున్నాను." అన్నాడు.

"అంతకన్న మంచి వాళ్ళు దొరకలేదా నీకు?" అనడిగిందా యిల్లాలు.

"మనదేమున్నదమ్మా। అంతా మాయ. ఆ రామయ్య తండ్రి ఏ నాటి కెక్కడ తావు చూపితే అక్కడే వుండాలి. మనదేమున్నది తల్లీ।" అన్నాడు.

"నువ్వు అక్కడుంటే ఈ గ్రామాల వాళ్ళు నీకు భిక్షం పెట్టరంట తెలుసా? అనుకుంటున్నారు" అంది.

"ఆయన్నే నమ్మాను. మిమ్మల్ని చూదుకుని బ్రతుకుతున్నాను. అన్యాయం చేస్తే చేసేదేముందమ్మా। ఆయనే దారి చూపుతాడు।"

"నీకేం నీవు చెపుతావు గాని రాందాసూ। నీకు గింజలేసే వాళ్ళను వెలేస్తారంట"

"ముష్టి ముండావాణ్ణి, నాదేముంది తల్లీ। అందరికీ గింజలు కొలిచే ఆ రామయ్య నన్నొదిలి పెడతాడా? వస్తాను తల్లీ, ప్రొద్దెక్కుతుంది?" అని తంబురా మీటుతూ బయలుదేరాడు.

ఈ విషయం కూడా తండాకు తెలిసింది. తండానాయకుడు రామదాసు నడిగాడు.

''రాందాసూ! ఊళ్ళో బిచ్చమేయనన్నారంట కాదా!''

''అంటారు దానికేం బాబూ! అననీ, రామయ్య తండ్రి ఎన్నని పించాలనుకుంటాడో అన్నీ అనిపిస్తాడు!''

'' అంతే గాని మరేం లేదంటావ్? నీ వింత వయసులో వుండి యిట్లాటి ముసలి మాటలు మాట్లాడతావేం! అయినా రాందాసూ నీకీ ముష్టి దేనికి? మాతో పాటు పనిచేసుకొని బ్రతకరాదా? ఒకరితో పొత్తుండదు. ఒకరి పెత్తనింపు ఉండవు''

"నువ్వింతవరకూ ఎవ్వరూ వేయని ప్రశ్నవేసావు నిజమే! ఈ మాటే నేను గొడ్ల సావిట్లో అయ్యగార్ని అడిగాను. ఆయన నాకు సమాధానం చెప్పారు."

''అడుక్కు తినమనా?'' అన్నాడు తండా నాయకుడు. అతని మాట పూర్తి కాకుండానే—

''విను. లోకంలో నాలుగు రకాల మనుష్యులుంటారంట. పాపం చేసేవాళ్ళు. పాపం చేయించే వాళ్ళు. పుణ్యం చేసే వాళ్ళు. పుణ్యం చేయించే వాళ్ళు.. పాపం చేయించే వాళ్ళ వల్ల పాపం చేసే వాళ్ళు పెరిగి పాడై పోతారు. పుణ్యం చేయించే వాళ్ళవల్ల పుణ్యం చేసే వాళ్ళు కూడా ఎక్కువవుతుంటారు. ఈ పుణ్యం చేయించే వాళ్ళుగా పుట్టడం చాలా అరుదు. ఆ పుట్టిన వాళ్ళు అలాగే బతకడం చాలా కష్టం. ఒకప్పుడు నా వంశం వాళ్ళు పుణ్యంచేయించే వాళ్ళట. నేను జనం చేసే పాపాలు పోవడానికి దేవుణ్ణి ఇరవై నాలుగ్గంటలూ కొలిచి, ఈ లోకంలో వాళ్ళ పాపాలకు తగినంత పుణ్యం అందజేయాలంట. అందుకే వాళ్ళలో నేను పుట్టానంట. అటువంటి వాళ్ళు ఎక్కువ మంది వుండరు. మా నాన్న బతికినంతకాలం అలాగే దేవుడితో 'ఈ పాపులను రక్షించు' అని, ఎంత దుర్మార్గులయినా కాపాడమని, రామనామం వాళ్ళ వద్దన్నా వినిపించి వాళ్ళకు పుణ్యం అందించాడట. అందువల్ల నీవు గొడ్ల కొట్టాల్లో చాకిరీకి కాదు. లోకం పదికాలాల పాటు వుండాలంటే నీవు ఎత్తివేయాల్సింది వీళ్ళ పాపాలురా—ఈ కొట్టాల్లో ఉచ్ఛిష్టం కాదు అన్నారు. అన్నట్టుగానే వారు భేదం లేకుండా అన్నీ విడమర్చి చెప్పారు. నా పొట్ట కోసమే ఐతే, నేను ఏ ఆకులో తిని బ్రతిగ్గలను. వీళ్ళందరి పాపాల సంగతేమిటి!'' అన్నాడు రాందాసు.

అంత చెప్పినా, ఆ తండా నాయకుడు విన్నా, అతనికి అందు లోని అర్థం తెలిసింది కాదు.

ఏదో అన్నాడు. ఏదో విన్నాడు. అంతే జరిగింది.

ఆ తర్వాత ఒకనాడు రామదాసు తను పుట్టిన గ్రామానికే బిచ్చానికి వెళ్ళాడు.

ఎవరూ గింజ రాల్చలేదు.

రామదాసు అలాగే పాట పాడుతున్నాడు, అతడి మామూలు ధోరణిగానే.

అంతలో గ్రామంలో ఒకతను వచ్చి—

"ఒరేయ్! నీ కిక్కడ గింజుకు చచ్చినా గింజ రాలదు. అసలు నిన్నెవర్రమ్మన్నార్రా?"

రామదాసు పాటనాపి—

"బాబూ! ఈ లోకంలోకి ఎవరు రమ్మంటే వచ్చాం నాయనా? అలాగే వచ్చాను," అన్నాడు సాత్వికంగా.

"ఇంకా మాటకు మాట చెపుతావా మాల ముండాకొడకా?" అన్నాడు.

అన్నవాడూరుకోక చేతి కర్రతో రాగి చెంబుమీద కొట్టాడు.

రాగిచెంబు క్రింద పడిపోయింది.

అందులోఉన్న బియ్యమన్నీ క్రింద పరచుకుపోయాయి.

మామూలుగా చెంబును కట్టుకోడం ఎప్పుడూ ఉండదు.

పడిపోయిన చెంబువంక చూస్తూ అలాగే క్షణం నిలిచి, ఆ తర్వాత మెల్లగా వంగి చెంబు పట్టుకున్నాడు.

చాలామంది అప్పటికే చుట్టూ చేరారు.

ఎవరూ మాట్లాడలేదు.

రామదాసేమీ మాట్లాడలేదు. అతనివంక జాలిగా చూచి తిరిగి చెంబు నెత్తిన పెట్టుకొని—

"ఈ గ్రామంలో పుట్టి పెరిగాను. మీరు వెళ్ళకొట్టిందాకా వెళ్ళ లేదు. రామయ్య తండ్రి దయ బాబూ! ముష్టిముండా కొడుకును. రావద్దంటే వస్తానా? ఏదో వచ్చాననుకో బాబూ! ఐపోయింది. మరచిపో

నాయనా! విన్ను రామయ్య తం(డి దయ చూడాలి! వెయ్యేళ్ళు (బతుకు తం(డీ!'' అన్నాడు.

"రేయ్ మాలోడా! పొలిమేర దాటిందాకా నీ గొంతు యినిపించిందా ఈ సారి కజ్జ నీ మీద పడుద్ది!" అన్నాడు.

"మంచిది బాబూ! మంచిది" అన్నాడు రామదాసు.

పల్లె పట్టులన్నీ అంతే. ఐతే అటూ, లేకపోతే యిటు!

రామదాసు తెలిసిగాని, తెలియకగాని ఎప్పుడూ ఎవరికీ ఏమీ కీడు చేసి యెరుగడు.

అతడు నష్టం కలిగించాలని పుట్టలేదు.

ఆ విషయం కొందరికి మా(తమే తెలుసు.

మరీ తెలిసిన వాళ్ళిద్దరే! ఒకరు అయ్యవారు, రెండు నేను. అంతకు మినహా మరెవ్వరికీ రామదాసు అంటే ఏమిటో తెలియదు.

రామదాసు సరాసరి తండాకు వచ్చాడు.

తండాలోని వాళ్ళంతా దాపుకు మామూలుగానే వెళ్ళారు.

జిలానీ కూడా వెళ్ళింది.

అంతా రామదాసు రాగానే,- మరీ పిల్లలు ఆ భజన చెక్కలు తీసుకొని లోపల పెట్టేవాళ్ళూ, తంబురా తీసుకొని వెళ్ళి లోపల పెట్టే వాళ్ళూగా రోజూ చేస్తారు.

ఆ రోజూ అలాగే అందుకొని, "రాందాసు! రాందాసు!" అని అన్నీ లోపలికి తీసుకొని వెళ్ళారు.

జిలానీ కూడా ఏదో అందుకోబోయి చెంబు చూచింది.

చెంబులో అడుగున ఎక్కడో ఒక చారెడు గింజలున్నాయి.

చెంబు సొట్టపోయి వుంది.

"ఏమిటిది?" అని రామదాసు వంక చూచింది.

అతని చెంబు ఎప్పుడూ అలా యింటికి రాలేదు. అందులోనూ సొట్టపోయింది.

"అంతా రాముని దయ!" అన్నాడు.

"ఎవ్వరూ చేయలేదా?" అని అడిగింది.

రామదాసులో ఏ మార్పూ లేదు.

ఆ ముఖం అలాగే ఉంది.

అంతా మామూలుగానే జరిగినట్లుగా ఉన్నాడు.

ఆ మాటకు సమాధాన మీయలేదు.

"చెంబు సొట్టలు పోయిందేం?" అని అడిగింది.

"క్రింద పడిందమ్మడూ!" అన్నాడు.

జిలాని ఊరుకుంది. పిల్లలంతా వెళ్ళిపోయారు. ఒక్క జిలానీ మాత్రమే అక్కడుంది.

ఆ పిల్ల రాందాసు మీద ఎన్నో కోరికలు పెంచుకొంది.

రాందాసు వచ్చే వేళకు అతడికి అన్నం కూడా వండి పెడుతుంది.

ఆకు కూరలో, దుంప కూరలో చేస్తుంది.

తండాలోని వారంతా మాంసం, చేపలూ తింటారు. రాందాసు తినేవాడు కాదు.

అందుకని చాలా సుద్ధిగానే చేయాలని చేతనైనంత వరకు అలాటి వాటిని అతని గుడిశ దాపుకు రానిచ్చేది కాదు.

రామదాసు లేనప్పుడు తండాలోని వారు యెగతాళిగా జిలానీని అల్లరి చేయడానికి 'రాందాసు పెళ్ళాం' అని ఆట పట్టించేవారు.

అలా అన్నప్పుడు ఆమె హృదయం ఎంతో హాయినీ, ఆనందాన్నీ అందుకొని వెలికి మాత్రం 'చాచ్చా! రాందాసు భర్తేడు' అనేది.

నిజంగా రాందాసు నాకు భర్త అయితే ఎంత బావుండును అనిపించేది ఆ మాటలంటుండగా ఆమెకు. ఒకోసారి రాందాసు కాలువ గట్టు మీద—

"హే రామ ప్రభూ!" అనే కేకవేసి పాటందుకొని వస్తుంటే అతనికన్న ముందు అతని రాకను పాట తెలియచేసేది. అది విని తండాలోనివారు—

"పోవే నీ మొగుడొస్తున్నాడు!" అనే వాళ్ళు.

ఆ మాటలకు లోలోన పొంగిపోయి, సిగ్గుతో కుచించుకుపోయి "ఛీ పాడూ!" అనేది.

ఆ పాడుకు అర్థమేమిటో ఎవరికీ తెలియదు. ఆమె హృదయానికి అన్న తర్వాత పాడూ- అన్నానేమిటీ అనిపించేది.

అతని హృదయం మామూలే.

అందరినీ చూచినట్టుగానే ఆమెనూ చూచాడు, చూచేవాడు.

కాపీ అతడామెకిచ్చిన అధికృతంతా తనకు వంట చేస్తూ తననే అంటి పెట్టుకొని ఉంటుందని.

ఏదైనా చెప్పినా, అడిగినా ఆమెనే. 'అమ్మడూ' అని ఆప్యాయంగా పిలిచి అడిగేవాడు.

ఈ ప్రత్యేకత వలన ఆమె హృదయం మరీ పెంచుకొని అతనికి దాసోహమైపోయింది.

అది ఒకనాడు కాదు, రోజుకు కొంత, క్షణానికి కొంతగా పెరిగి రామదాసు రూపం, హృదయం, సర్వం ఆమెలో నిండి నిఘడీకృతమైపోయింది.

అర్ధరాత్రి తనను ఎవరు నిద్రలేపినా "ఏం రాందాసూ. ఏం కావాలి?" అనే స్థితికి వచ్చింది.

ఇది ఎవ్వరికీ బాధలేదు.

రామదాసును అంతా నమ్మారు, దానికి తగినట్లు అతను చాలా మంచివాడు. ఉత్తముడు, రామభక్తుడు. హాని చేయడం చేతగాని సాధువు అన్నది అందరిలోనూ మూకుమ్మడిగా ఏర్పడిన అభిప్రాయం.

అందువలన వారిద్దరూ ఎలా వున్నా, ఎవ్వరూ పట్టించుకోలేదు.

ఆఖరికి జిలానీని చేసుకోబోయే మామ కూడా అలాగే ఉన్నాడు. అతడు కూడా నాయకుని తర్వాత రెండో నాయకుడు. జిలానీని చేసుకున్న మరుక్షణం అతడు మామగారి పదవిలోనికి వస్తాడు. నాయకునికి కొడుకులు లేని కారణంగా అల్లుడే వస్తాడు. అతడు కూడా "ఏం రాందాసూ! దాన్ని పాడు చేస్తున్నావ్. ఆతర్వాత నీ యిష్టం" అనేవాడు.

జిలానీకి అతని మీద ఒకసారి మనసున్నదీ లేదు. ఈ నాడు తరిగిందీ లేదు. పెరగడం లేదు. నిలిచి పోయింది.

అంతే!

తలలో నాల్కయ్యాడు రామదాసు తండాకు. ఏ తగాయిదా వచ్చినా "రాందాసూ! రాందాసూ!" అని తండా అంతా - ఆ గుడిసెను చుట్టుముట్టి న్యాయం చెప్పమనేది.

రామదాసు చెప్పింది వేదం.

అంతా "ఆఁ అదీ అదీ" అని ఇరువంకల వారు ఒప్పుకొనేవారు.

అలా ఒప్పుకోని పక్షంలో రామదాసు ఒప్పుకోనివారిని దాపుగా కూర్చో బెట్టుకొని వారికి బాగా అంజేటట్టు చెప్పి ఒప్పించేవాడు.

రామదాసు మీద ఈగ వాలితే తండాలోని పసికాయ కూడా దేవుడి మీద తిరగబడుతుంది. ఆ నాడల్లా గ్రామంలో జరిగింది రామదాసు చెప్పలేదు.

రెండవ నాటికి తండా నాయకునికి తెలియనే తెలిసింది.

జరజర పొదలోని పాములా వచ్చి రామదాసు ముందు నిలిచి. "ఏం రామదాసూ! చెప్పనే లేదు" అన్నాడు. రామదాసుకు అతడడిగే విషయం తెలుసు. ఐనా—

"ఏమిటి" అన్నాడు.

"మొన్న గ్రామంలో జరిగింది!"

"ఏం జరిగింది?" అన్నాడు రామదాసు ఏమీ ఎరగనట్టె

"మునసబుగారి పాలేరు కర్ర దీసుకొని చెంబు పడగొట్టాడంట కదూ?" అన్నాడు నాయకుడు కోపంగా.

"అదా!....పిచ్చివాడు" అని నవ్వాడు రాందాసు. చెంబు సొట్ట ఎందుకు పోయిందో జిలానీకి అప్పుడు తెలిసింది.

"పిచ్చి కాదు. కొవ్వు" న్నాడు నాయకుడు.

"పోనీ అదే ననుకుందాం! ఏం" అన్నాడు.

"నువ్వేమన్నా అను రాందాసూ! గ్రామం వాళ్ళకిది తగదు"

"పోనీ మనం చేయగలిగింది ఏముంది?"

"ప్రాణం పోతే యేం ఆ తర్వాత?పరువూ మర్యాద పోయాక చేతులు కట్టుకొని వుండడం దేనికి?" అన్నాడు నాయకుడు

"తొందర పడుతున్నావు. ముష్టివాడికి నాకు పరువేమిటి? చెప్పు! పరువూ ప్రతిష్ఠా మనస్సు లేని వాళ్ళకయ్యా! హృదయం లేని వాళ్ళు వాటిని చూపి బ్రతుకుతుంటారు. హృదయం వున్న వాళ్ళు దయను చూపి, దయను అందుకొని బ్రతుకుతుంటారు. తొందరపడకు, అన్నింటికీ ఒక్క రామయ్య తండ్రి వున్నాడు. నీవు, నేను ఎందుకు కల్పించుకోవాలి? ఆయన ఆజ్ఞ లేనిదే వాడు

కర్ర విసురుతాడా, విసిరినా అది తగులుతుందా! అలా విసరడం అది తగలడం, చెంబు పడడం అంతా ఆయనకు యిష్టమయ్యే జరుపు కున్నాడు. మనకెందుకు?" అన్నారు.

హడావిడిగా వచ్చిన తండా నాయకుడు చప్పగా చల్లారి వెళ్ళిపోయాడు.

జిలానీ అక్కడే వుంది "ఈ విషయం నాతో కూడా చెప్ప లేదెందుకని?" అని అడిగింది

"అమ్మడూ! నువ్వూ నేనూ ఏం చేయగలం?" అన్నాడు.

ఆ 'నువ్వూ, నేనూ' అని కలపడంతో జిలానీకి ఎక్కడలేని ఆనందం కలిగింది.

అదొక విధమైన తృప్తి.

దానికి గోరంత దొరికితే కొండంత చేసుకొని తృప్తిపడతారు.

అది వయస్సులో మనసీయడంవలన కలిగేది.

ఆ తర్వాత ఆమె మాటాడలేకపోయింది.

ఆ తృప్తిలోనే ఉండిపోయింది.

రామదాసు గోముగా జిలానీ తల నిమురుతూ, "పిచ్చిదానా! ఈ లోకంలో వారు అంతా తామే చేస్తున్నారని, అంతా తమ ప్రభావమని అనుకుంటారు. కాదని తెలుసుకోగలిగితే కొంచెంలో కొంచమైనా బాగుపడతారు." అతడేదేదో చెప్పుకుపోతున్నాడు.

ఆమె కవేమీ విన్పించలేదు.

ఆమెలోని వాంఛల మనస్సుకు,కోరికలతో ఉడికిపోయే హృదయానికి అదేదో జోలపాట లాంటిది పాడినట్లుగా ఉండి తన్మయతలో అలాగే ఉండిపోయింది.

అతను చెప్పేవేవీ వినిపించడంలేదు.

అతడు ఆ తల నిమరడంలోని హాయిని, తృప్తినీ మాత్రమే అందుకోగలిగింది.

అంతే!

వయసులో ఉన్నవారు ఏదో కోరుకుంటారు.

అదంతా అందకపోయినా దానికి సంబంధించినదే కాస్త అందినా తృప్తిపడడం జరుగుతుంది.

నాలుగు రోజులు గడచి పోయాయి.

పల్లెలు దాదాపు రామదాసుకు మునుపటిలా గింజలు వేయడం లేదు.

# 4

సంక్రాంతి రోజులొచ్చాయి.

ఆ రోజుల్లో దాసర్లకు సంవత్సరానికి సరిపోయే గ్రాసం దొరుకుతుంది.

ఆ సంవత్సరం రామదాసుకు ఏమీ మిగులు దలలేదు.దిన ఖర్చానికి సరిపోయింది.

తండావారూ, జిలానీ ఇదేమిటని అడిగారు. "దానిదేముంది రామయ్య దయ!" అనేవాడు తప్ప, మరోమాట లేదు.

"పాపం పెరిగిపోయింది రాందాసూ!" అనేవాళ్ళు.

"మనకు దొరకలేదని పాపం పెరుగుతుందా? కాదు. మనకు వేసేది ఇతర్ల కెవరికో వేస్తారు. వారంతా పుణ్యాత్ములు. మనమే పాపం చేసుకుంటున్నామేమో. ఎవరికి తెలుసు? అదంతా చూసుకో వలసినవాడు ఆయన. మనకెందుకు" అంటాడు రామదాసు.

ఒకో రోజు ఉత్త చెంబుతోనే వచ్చేవాడు.

తండావాళ్ళే నాలుగు గింజలు పెట్టేవారు.

కాయలతోపాటూ చేలూ ఎండినట్టు తండా వారికి కూడా పనులు చూపటంలేదు గ్రామస్థులు.

పల్లె తర్వాత పల్లె పాకిపోయింది, తండాను నిరసిస్తున్నారు.

తండావారు సాగు చేసుకొంటున్న భూములు కూడా లాక్కోవాలని గ్రామస్థులు ప్రయత్నించారు. వారిలో వారికి భాగాలు కుదరక వదలివేశారు.

ఒకనాడు సంధ్యలో రామదాసు కాలవగట్టు మీదుగా వస్తు

న్నాడు. ఎదురు వస్తున్న మునసబుగారి పాలేరు వస్తూ, వస్తూ కేకవేసి పడిపోయాడు.

రామదాసు పరుగెత్తుకొని వెళ్ళి చూచాడు. దూరంగా నల్ల త్రాచు వెళ్ళిపోతూంది.

తంబురా, చెంబు, భజన పలకలు గట్టుమీద పెట్టి, ఆ పాలేరును బుజాన వేసుకొని మూడూళ్ళు దాటి, ఆ తర్వాత ఊరిలో ఉన్న ఒక మంత్రగాడి దగ్గర పడుకోపెట్టాడు.

అతడు క్రిందామీదాచేసి ఎలాగైతేయేం బ్రతికించాడు.

ఈలోగా ఒక చిత్రం జరిగింది.

రామదాసు ఆదుర్దాగా పారవేసి వెళ్ళిన తంబురా, చెంబు, భజన చెక్కలు పట్టుకొని తండాలోని ఒక లంబాడీ తండాకు చేరాడు.

అప్పటికి ప్రొద్దు పోయింది.

సంజె దీపాలు పెట్టారు. ఆ మూడింటినీ చూచిన నాయకుడు "ఇంకేముంది. రాందాసును చంపి ఏట్లో పారేశారు గ్రామస్తులు" అనగానే, చేతికందింది అందినట్టు తీసుకొని తండా తండా యావత్తూ గ్రామం చేరారు.

పల్లెల్లో జరిగే వాటికి ఒకోదానికి అర్థం పర్థం ఉండదు. చిన్న కారణానికి నానా రభసా జరిపి, అల్లకల్లోలమైపోతారు. మునసబునూ కరణాన్నీ గ్రామ పెద్దనూ రచ్చబండ క్రిందికి చేర్చి పంచాయితీ పెట్టి, రామదాసు విషయం అడిగారు.

"రామదాసో గీమదాసో ఎవరికి తెలుసు, ముష్టి గాడిద కొడుకు సంగతి." అన్నారు గ్రామపెత్తందారులు.

తండానాయకుడు లేచాడు.

"మాకు దిక్కూ దివాణం లేదు. మేమెక్కడినుండో వచ్చిన వాళ్ళం. చచ్చినా బ్రతికినా మాకేంలేదు. మీ పొలాలు, ఇళ్ళూ గొడ్డూ గోదాతో ఉన్నారు మీరు. మేము ఏమైనా మాకేం లేదు. మేము తెగించిగాని ఏదయినా చేసామా, మీరంతా అన్యాయమై పోతారు. మాలో పిల్లాడు బ్రతికున్నా ఈ గ్రామాన్ని గ్రామంగా ఉంచడు. ఏ రాత్రో ఏ చీకటిలోనో మీరు రాందాసు గుడిశ తగలేసినట్టు గ్రామాన్ని మొత్తాన్ని తగలేస్తాడు. మీ మనిషి, మీ సాటివాడు.

మిమ్మల్ని నమ్ముకొని బ్రతికేవాడు. ఒక ముష్టివాణ్ణి, కసికట్టి సాధిస్తున్నారంటే మీ పెద్దలకు తలకాయ ఉందో, లేదో తెలియడంలేదు."

"ఓర్లంబాడీ! ఆగరా! మా లావు మాటాడేవు," అన్నాడు పెత్తనందారు.

"సిగ్గులేనోళ్ళతో మాటాడ్డం మాదే బుద్ధి తక్కువ! మీవాడు రాందాసు, మా గ్రామంలో పుట్టి పెరిగాడు. మీలోనే ఎవరో కాలవ గట్టుమీద చంపి ఏట్లో పారేసివుంటారు. అదడగడానికే వచ్చాం!" అన్నాడు తండా నాయకుడు.

గ్రామస్థులు చంపారూ అనడంతో అందరి మనస్సుల్లో రామదాసు కదిలాడు.

అతడంటే ఏమిటో అందరికీ తెలిసింది.

అతనిలో విశిష్టత లేదు.

గొప్పవాడు కాదు.

బిచ్చగాడు.

ఒకరి జోలి, ఒకరి మతం పట్టించుకోని మనిషి.

అతడందరికీ తెలుసు.

అంతా అప్పుడాలోచించారు.

అతడి మీద దేనికీ కక్ష!

అతడేం చేశాడు? ఎవ్వరికీ అతడు చేసింది తెలియలేదు. ఉంటే కదా తెలియడానికి?

నడివీథిలో చెంబును నేలగొడితే "నిన్ను రామయ్య కాపాడాలి" అన్నాడు.

అతని గుడిశ కాలిస్తే "రామయ్య తగలబెట్టాడు. అంతా అతని దయ" అన్నాడు.

ఇదంతా ఎవరికోసం?

ఎవరు చేసినట్లో అర్థంకాలేదు తండావారికీ, గ్రామవాసులకూ కూడా.

అంత ఆలోచన కలగడానికి కారణం అతడు చచ్చిపోయాడనే మాట - అతన్నిగూర్చి ఆలోచించేంతవరకూ వారి వారి మనస్సులను లాగింది.

మనుష్యుల్లో ఉన్న గుణమే అది.

అందులో హైందవులు మరీను.

తండ్రికి అన్నం పెట్టకుండా చంపి. ఆ తర్వాత గోదానం, భూదానం చేస్తారు.

ఆ గోదాన,భూదానాల సొమ్ముతో యింకొంత కాలం తండ్రిని పోషించవచ్చు.

ఐనా సరే.

అది వారి సంస్కృతి.

వారి నీతి.

వారి మర్యాద.

రామదాసు విషయంలోనూ అలాగే-చచ్చిపోయాడు అని తెలియగానే చాలా విచారించారు.

తర్వాత తలా ఒక రీతిగా అతని ఆత్మకు శాంతి కలిగేలా విచారించారు.

లంబాడీలను సమాధానపరచారు.

అప్పుడు బయటపడింది. లంబాడీలకూ వారికీ తగాయిదా ఏమిటో.

ఆ కారణం చెపితే చాలా ఆశ్చర్యపోతావు.

ఎంత పెద్ద కారణమో తెలుసా?

పేడకడి దగ్గర తగాయిదా! ఊరు పెద్ద జీతగాడు, లంబాడీల అవులమంద పేడకళ్ళను మదేశాడు.

మదేయడమంటే తెలుసా?

మరొకరు తీయకుండా ఉండాలని, అప్పటికి ఆ పేడకళ్ళను కాలుతో కొంచం ఒక ప్రక్కకు నెట్టి వెళ్ళిపోతారు.

దానిని ఆ తర్వాత, వేసిన వాళ్ళు తప్ప మరొకరు తాకరు.

ఎవరికివారు, ఎవరో దీనిని తీసుకున్నారని అనుకోవలసిందే.

ఆ వేసినవాళ్ళు మరచిపోయినా అది అక్కడ ఎండిపోయి మట్టిలో కలసిపోవలసిందేగాని, మరొకరు దానిని తాకరు.

సామాన్యంగా అది జీతగాళ్ళు చేయరు.

నంటలేదేవాళ్ళు, చేసేవాళ్ళు చేస్తారు.

మరొకటి

ఒకరి గొడ్లకు మరొకరా పనిచేయరు.

లంబాడీల ఆలమంద వేసిన పేడకళ్ళన్నిటికీ గ్రామపెద్ద జీతగాడా పనిచేశాడు. నన్నేడిపిస్తానికి చేశాడులే అనుకొని లంబాడీ తీసిందా పేడమడి.

అక్కడ పుట్టిన తగాయిదా చేనుదాకా ప్రాకి, గ్రామపెద్ద జీతగాడి మూలాన గ్రామానికీ తండాకూ పచ్చిగడ్డి భగ్గునమండే తీరుదాకా లాగింది.

గ్రామాల్లో తగాయిదాలు విన్నావా?

అలా ఉంటాయి. ఆ పేడ తగాయిదా రామదాసుమీదికి తిరిగింది. రామదాసుకు గింజలు పుట్టకుండా చేసింది.

గ్రామస్తులు పాత తగాయిదా మూలం తెలిసి రాజీపడ్డారు. విచారించారు. ఎవరు చేశారో తెలుసుకొని వాడికి తగినశాస్తి చేస్తామని, ఇకమీద గ్రామాలవాళ్ళు లంబాడీలకు పనులు చెపుతారని, చెప్పాలనీ పంచాయితీలో తేలినసారం.

గ్రామస్తులు. 'పాపం! లంబాడోళ్ళ రాందాసు' అన్నారు.

లంబాడీలంతా 'మా రాందాసు' అనుకున్నారు.

లంబాడీలు రెచ్చిపోతే- తండానాయకుడన్నట్టు అర్ధరాత్రిపూట కొంపలన్నీ తగలేసినా తగలేస్తారు- తాలూ తగాయిదాలేవి రాలుగాయి ముండాకొడుకులని ఆలోచించి, రాజీపడి అసలు విషయం బయట పెట్టారు. జిలాసీకి మాటా పలుకూ లేదు-

ఇక ఈ తండా ఏమైతేనేం?

ఈ గ్రామం వాళ్ళు పనులుచెపితే యెంత? చెప్పకపోతే యెంత? నా రాందాసు నాకు లేకపోయాకని, త్రాణలేని దానిలా అలాగే నిలిచిపోయింది.

ఇంత జరుగుతున్నా. ఆమెకెంతో బాధగా ఉన్నా లోలోన ఏదో ఒక ఆశాకిరణం ఆమెను మెలిపెట్టుంది.

ఆ బాధలో ఆమె కా ఆశాకిరణం వెలికి రాలేకపోయింది.

పంచాయితీ జరిగిపోయింది.

గ్రామం వాళ్ళూ, తండా వాళ్ళూ కలసిపోయారు.

ఎవరి దారిన వాళ్ళు వెళ్ళిపోయారు.

అందరికీ రాందాసు గొంతు వినిపిస్తున్నట్టుగా ఉంది.

జిలానీ తండా స్థావరం చేరాక ఆ చెంబునూ, ఆ చెక్కలను, ఆ తంబురాను పెట్టుకొని ఒళ్ళు తెలియకుండా ఏడుస్తూంది. రామదాసు గుడిశలో నుండి వెలికి రాలేదు ఆమె.

అంతా విచారంగానే ఉన్నారు కాబట్టి ఆ విషయాన్ని మరొక విధంగా తలపోశారు కాదు తండాలోని వారు.

ఇది యిక్కడి పరిస్థితి.

పోతే నాలుగు గ్రామాలవతలి విషయం—

ఆ మంత్రగాడు పాలేరును బ్రతికించి ఏదో పొడి చేతిలో పెట్టి నోట్లో కొంత వేసి, కళ్ళల్లో ఏదో పసరు పోసి 'రాత్రికంతా కన్ను మూయకూడదు. ఈ నాలుగూళ్ళూ దాటి ఇప్పుడేం వెళతారు, ఇక్కడే వుండండని' పంచలో జాగా చూపాడు.

రామదాసు అతణ్ణి నిదురపోకుండా చూడాలి.

అతనితోపాటూ తనూ మేల్కొని కూర్చున్నాడు.

వాడికి ఒళ్ళు తెలిశాక వాడన్నాడు—

"రాందాసూ! నువ్వు మనిషివో, దేవుడివో నాకు తెలియటం లేదు" అన్నాడు.

"అదేమిటి అలాగంటావు బాబూ! నేను దేవుణ్ణయితే నిన్నిక్కడి దాకా ఎందుకు తెస్తాను? అక్కడే బ్రతికించి ఇంటికి పంపక పోయానా?" అన్నాడు.

"రాందాసూ! ఆ నాడు అట్లా నడి ఊళ్ళో చెంబు పగలేసి అడుక్కొచ్చిన గింజలన్నీ నేలపాలు చేసి తిట్టానే! అట్లాటి వాణ్ణి బుజాన వేసుకొని నాలుక్కోసులు నడిచి వచ్చావు. నీకు నేనేం చేయ గలను రాందాసూ!" అన్నాడు ఏడుస్తూ ఆ పాలేరు.

"ఆఁ! ఏడవకూడదు. కళ్ళల్లో వేసిన మందు కరిగిపోతుం దేమో! అంతా రాముడాజ్ఞ! నేనేం చేసేది. నేను కాకపోతే నా తాత ఇంకొకడు నీకు సాయపడి ఉంటాడు. శివుడాజ్ఞ లేందే చీమైనా కుట్టదు. అంతా భగవంతుడి లీల. మనదేముంది? ఆ నాడు భగవంతుడి సాయంతో ఆ అర్జునుడు కురుక్షేత్రంలో అంత మందిని అవలీలగా

చంపి, ఆ తర్వాత భగవంతుడు తోడులేక పోయేప్పటికి, ఆడవాళ్ళను కాపాడలేక ఓడిపోయి ఏడుస్తూ ఇంటికి వచ్చాడు. తెలుసా! రామయ్య తండ్రి దయ ఉండటంవల్ల, హనుమంతుడు వంద యోజనాలున్న సముద్రాన్ని అట్టే దాటి, సీత జాడ తెల్పి, లంకను కాల్చి రావణా బ్రహ్మను నువ్వెంత అన్నాడు, తెలుసా? మనదేముంది?" అన్నాడు రామదాసు.

"ఏమో, రాందాసూ! నీకు తెలిగ్గానే ఉంది. కాని నీవు గాని వచ్చి ఆదుకోకపోయినట్లయితే నా పెళ్ళాం బిడ్డలు అబోమని ఏడ్చి, అన్యాయమై పోయుండే వాళ్ళు గాదా?" అన్నాడు పాలేరు.

"చెపుతున్నాగా. నాదీ, నీది ఏమీ లేదు. అంతా ఆయన దయ. ఆ రామయ్య తండ్రే నడిపించేది," అన్నాడు రామదాసు.

అతనికి మరొక మాట రాదు.

మరొకరిని నమ్మడు.

అంతా రామచంద్రుని దయే!

ఆ మాటకు సమాధానం రాలేదు.

మంత్రం పెట్టిన వైద్యుడు "రాందాసూ! ఈ మధ్య నువ్వు లంబాడోళ్ళల్లో కలిశావా?" అనడిగాడు.

"అదేమిటయ్యా, అలాగన్నావు? నేను లంబాడోళ్ళల్లో కలవడ మేమిటి? గ్రామంలో ఒద్దన్నారు పెద్దలు. తండావాళ్ళు గుడిశ వేసి 'యిందులో ఉండూ' అన్నారు. అందులో తల దాచుకుంటున్నాను. అంతే! "

"మరి వీళ్ళంతా ఆళ్ళల్లో కలసిపోయావంటారేం?"

"పిచ్చి తండ్రులు-ఏదేదో అంటూ, అనుకుంటూ ఉంటారు. నే నెవరితో ఉంజేయేం? అంతా నా వాళ్లేకదా? నే నెవ్వరిని కాదం టాను? అంతా నాక్కావాలి! ఈ లోకంలో ఉండేవాళ్ళంతా, రామయ్య తండ్రి బిడ్డలు!" అన్నాడు.

"ఏమిటో రాందాసూ! నీవు సత్యకాలపు మనిషివి!"

"ఏం సత్యం బాబూ! అంతా మీ అందరి దయా!" వీరిద్దరిలా మాట్లాడుతుండగా అతడు కునికిపాట్లు పడుతున్నాడు.

"బాబూ! నీవు రెప్ప వేయకూడదు, పంతులుగా ఏదన్నా మాట్లాడు."

"నువ్వు ఏదన్నా చెప్పు!"

"నేను చెపితే నీవు నిద్రపోతావు. నువ్వు మాట్లాడుతుంటే నిద్ర రాదు."

"నాకేం తెలుసు! మోటుగాడిదని" అన్నాడా పాలేరు.

"అలా అనుకోకు బాబూ? మనం చేసేది మోటుపని గాని, మన మనసులన్నీ నాజూకైనవే. అసలు మనసుల్లో మోటుతనం లేదు-అని అయ్యవారు చెప్పేవారు. అందరి మనసులూ చాలా నాజూకుగా ఉంటాయట. ఏం వైద్యుడు బాబూ, నే చెప్పేది నిజమా? అబద్ధమా?" అనడిగాడు లోపలున్న మంత్రవైద్యుణ్ణి.

అతడు లోపలుండే—

'నువ్వు పుట్టింది మాల దాసరల్లోనైనా బ్రాహ్మణుల సావాసం చేసి చదువుకున్నావు. నీ శరీరం మాల. నీ మనస్సు, బుద్ధీ అసలైన బ్రాహ్మణ్యం. నీవు చెప్పేది నిజం కాకుండా ఉంటుందా? ఏదేనా ఒక పాట పాడు.'

'పాటదేముంది బాబూ! నా బొంద—నాపాటా పాడూను—నాకేమొచ్చు. ఐనా పాడతాను!' అని అలవాటు ప్రకారం చేమెత్తి. 'అరన్నా! నాచెంబూ, చెక్కలు, తంబురా కాలవగట్టున వదలొచ్చాను. ఏ పిల్లలో పాడుచేయరు గదా?' అన్నాడు.

'అరె కాలవగట్టున పెట్టొచ్చావా?'

'పెడితే యేంలే బాబూ! అవెక్కడికి పోతాయి! నా వని అందరికీ తెలుసుగా?'

'ఏమో రాందాసూ! నీవు నాకోసం చాలా కష్టపడ్డావు. పడుతున్నావు.' అన్నాడు పాలేరు.

'ఎవరి కోసం పడుతున్నాను? మాట మాటకీ అ మాటంటావు బాబూ! మీరంతా యిన్నాళ్ళూ ఎవరికోసమని, ఎందుకోసమని రోజూ తలోగింజావేసి ఇంతవాణ్ణి ఇంతవాడిగా చేశారు? మీరంతా దాగుండక పోతే నేనెక్కడుంటాను? నాకోసం నేను చేసుకుంటున్నానుగాని, మీ కోసమని నేనేం చేయగలను? ఏం చేస్తాను? ముష్టాణ్ణి! ఈ!

కష్టం ఒక కష్టమా? యాదాది పొడుగునా రెక్కలు ముక్కలయ్యేట్టు చాకిరీచేసి వచ్చినగింజలు తలోకాస్తా నాకు పెట్టడంలేదా" అన్నాడు.

'బాబో! రాందాసూ! నీకు సమాధానం చెప్పలేం గాని ఏదీ ఒక పాటపాడూ!' అన్నాడు వైద్యుడు అంతా విని,

రామదాసు రామాయణంలోని సీతాపహరణాన్ని పాడి విని పించాడు.

అది జోలపాటగా మంత్ర వైద్యుడు నిదురపోయాడు.

పాలేరు కన్ను కూరుకుతుంతగా—

'చూచావా బాబూ! నీవు కన్ను మూస్తున్నావు' అన్నాడు.

అతడు తెప్పరిల్లి, 'లేదు లేదు నిద్రపోవడం లేదు. పాట వింటున్నా' అన్నాడు.

అతడు గొంతెత్తిన కాసేపటికే, ఆ పల్లెలోని వారంతా అక్క డకు చేరి, ఆలించడం మొదలెట్టారు.

# 5

అర్ధరాత్రి దాటింది.

అంతా మళ్ళీ ఆ కథనంతా పాడు పాడూ అని అల్లరిపెట్టారు.

రామదాసు కాదనలేక ఆ ఘట్టాన్నంతా వినిపించాడు.

ఆ తర్వాత కోళ్ళు కూశాయి.

మంత్ర వైద్యుడు అప్పుడు నిద్రలేచి, తిరిగి ఏదో మంచిచ్చి ఇక వెళ్ళండన్నాడు.

రామదాసూ, పాలేరు కలిసి తిరిగి నడక సాగించారు.

పాలేరు గ్రామం చేరాడు.

రామదాసు తండాకు చేరి, తన గుడిశలోనికి అడుగు పెట్ట బోయాడు.

తండా తండా కదలి వచ్చిందక్కడకు. వాళ్ళ కనులు వాళ్ళే నమ్మలేకపోయారు.

ఏమిటిది ?

చచ్చిపోయిన రామదాసు రావడం అన్నదే వారి ఆశ్చర్యం!

జిలానీ రామదాసు గుడిశలోనుండి వెలికివచ్చి ఆనందంలో మునిగిపోయి తనను తాను నమ్మలేక అలాగే ౹మాన్పడింది.

అందరూ అలా తన చుట్టూ నిలిచి ఏదో భూతాన్ని చూచినట్టు చూడడం చూచి, తనూ ఆశ్చర్యపోయి తనంత తానే తెప్పరిల్లి "ఏమిటి అలా చూస్తారు?" అనడిగాడు.

అతడు మాటాడ్డం మరీ దిగ్భ్రాంతులను చేసింది.

అలాగే ఎవరికీ కాలూ చేయాడలేదు.

అందరూ మోళ్ళలా నిలిచారు.

తండా నాయకుడు ముందుకువచ్చి దగ్గరగా నిలిచి రామదాసును క్రిందనుండి పైదాకా చూస్తూ, 'రాందాసూ!' అన్నాడు.

"అదేమిటీ అలా చూస్తావు" అన్నాడు రాందాసు.

"నీవు బ్రతికే ఉన్నావా!" అన్నాడు తండా నాయకుడు.

"ఏమిటిది, చాలా ఆశ్చర్యంగాఉంది! మీరలా ఉండట చూస్తే నాకు పిచ్చెక్కేట్టుగా ఉంది. ఏమైంది?" అనడిగాడు రామదాసు వారిని తిరిగి.

తండా నాయకుడు దగ్గరగా వెళ్ళి అతన్ని తాకి చూచి "రాందాసూ!" అని కౌగలించుకున్నాడు.

అలాగే వాటేసుకొని "రాందాసూ! రాత్రంతా రాలేదేం? ఎక్కడకు వెళ్ళావు? ఏం జరిగింది? రాత్రికి రాత్రి అంతా గ్రామంమీదకు వెళ్ళి తగువాడి వచ్చాం, ఎప్పుడూ వదలని తంబురా, చెక్కలు, చెంబూ కాలవ గట్టుమీద వదలి ఎక్కడకు వెళ్ళావు?" అన్నాడు.

అందరూ గాలి బాగా పీల్చి వదిలారు.

రామదాసు అతడి గుడిశ అరుగుమీద కూర్చుని జరిగినదంతా చెప్పాడు.

అంతా ఆశ్చర్యపోయి, "అదా జరిగింది! ఎంత తొందర పడ్డాం! అరరే" అని క్షణమాలోచించి, "రాందాసూ! నేను గ్రామం వెళ్ళి గ్రామపెద్దకు క్షమాపణలు చెప్పుకొని వస్తాను." అన్నాడు.

రామదాసు "నీవు గ్రామానికి వెళతావా?" అనడిగాడు.

"ఆఁ ఆఁ వెళ్ళాలి. వెళ్ళి, వాళ్ళతో మాట్లాడాలి" అన్నాడు.

"అంటే ఒక్క రాత్రిలో రామయ్యతండ్రి ఎంతో మార్పు చేశాడన్నమాట" అన్నాడు రామదాసు.

ఆ తర్వాత తండా నాయకుడు రాత్రి జరిగినదంతా చెప్పాడు.

అదంతా విని రామదాసు—

"చూచారా, అదంతా ఆయన దయ అని నేనంటే మీరు నమ్మారా? నా రామయ్యతండ్రి అందరికీ మంచి బుద్ధులే ఇస్తాడు. అర్థం చేసుకోలేక ఈ మనుష్యులు ఏదేదో అనుకుంటారు. అంతా ఆయన చలవ. ఆయన ఇష్టం. అంతేగాని మరోలా ఎప్పుడూ జరగ" దన్నాడు.

తండా నాయకుడు సరాసరి కాలవ గట్టునే బయలుదేరాడు గ్రామానికి.

రామదాసు ఏటిలో స్నానంచేసి నామాలు దిద్దుకుంటున్నాడు చిన్న అద్దం పెంకు ముందు పెట్టుకొని.

జిలానీ వచ్చింది.

ఆమెను చూచి—

"అమ్మడూ! నా చెంబూ,తంబూరాలు గుడిశ కెవరుచేర్చారూ?" అనడిగాడు.

జిలానీ తృప్తిగా అతని వంక చూస్తూ "దైసీ అటుకేసి వెళ్ళి వస్తూ, వస్తూ ఇవి చూచి చేతబట్టుకొచ్చాడు. ఆ తర్వాతే ఈ గొడవంతా జరిగింది. ఇక నువ్వెటన్నా వెళ్ళేప్పుడు చెప్పి వెళ్ళు" అన్నది.

"పిచ్చిదానా! పురుగు చెప్పి ముట్టుకుందా? నాకు మాత్రం ఏం తెలుసు చెప్పూ?" అన్నాడు.

"ఇప్పుడు సరేననుకో. ఇక ముందు" అన్నది జిలానీ.

"నే నెందుకు వెళతానూ?" అన్నాడు,

ఆ తర్వాత ఆనాటికి రామదాసు సంచారం పోలేదు.

గుడిశలోనే ఉన్నాడు.

జిలానీ అతని దాపునే ఉంది.

క్షణం వదిలేది కాదు.

ఆమె ఆశయం వేరు.

అతని ఉద్దేశంతో ఆమెకు పనిలేకపోయింది.

అతడామెనెలా చూస్తున్నాడో తెలుసుకోవాలని కూడా ఆమె అనుకోలేదు.

అతనికి హృదయం ఇచ్చింది.

లోకాన్ని, లోకులను మరచిపోయింది.

తనను తాను మరచిపోయింది.

సంఘం విలువలు, సంఘంలో అతనికీ ఆమెకూ మధ్య ఉన్న అఘాధాన్ని ఆమె ఊహించలేదు.

ఊహించడానికి ఆమెకు వేళకూడా లేదు.

ఎంతసేపటికీ అతడు తనకు కావాలన్నదితప్ప మరో యోచనలేదు.

అందరూ అంతేనేమో, అంతరాలస్థాయి హృదయమిచ్చేప్పుడు ఎంచుకోరు.

వారికేదో నచ్చినదొకటి ఉంటుంది. దానితో సర్వం మరచిపోయి, సంచరిస్తారు.

ప్రస్తుతం జిలానీకూడా ఆ తెగలో, ఆ తరగతిలోనే ఉంది.

తన సర్వం అతనికిచ్చి ఆమె బానిసలా లొంగిపోయి, అతని కోసం ఏమైనా కాగలదు.

ఇక్కడిలా ఉండగా తండా నాయకుడు గ్రామం చేరక ముందరే, పాలేరు గ్రామంలో అడుగు పెడుతూనే జరిగినదంతా చెప్పి, రామదాసు చేసిన సేవంతా చెప్పాడు.

ఒక మనిషినెత్తుకొని నాలుగు క్రోసులదూరం యెవరువెళతారు?

అందులో రామదాసును ఆ పాలేరు నడివీధిలో జరిపిన అల్లరి, చేసిన సవాలు తెలిసిన ప్రతీవారూ ఆ పని రామదాసు కాబట్టి చేశాడు, మరొకరు చేయలేరు- అనుకున్నారు.

గ్రామపెద్దకూడా విని చాలా సంతోషించాడు.

తిరిగి రామదాసు బ్రతికున్నందుకు ఎంతగానో సంతోషించాడు లోలోన.

అది పెలికి చెపితే తనకు గొప్పలేదని, పైకిమాత్రం 'అం ఎందరు చావడంలేదు- ఎందరు బ్రతకడంలేదు. ఇదొక గొప్పా,' అన్నాడు.

తిరిగి సమస్య ఆరంభమైంది.

రామదాసును అంతకు ముందులా గ్రామంలోనే నిల్పడమా? లేక తండాలోనే ఉంచడమా? రాత్రి అతడు చచ్చిపోయాడని ఊరుకున్నారు. తెల్లవారేసరికి- ఎంత మార్పు!

అతడు బ్రతికే ఉన్నాడు.

అసలా లంబాడీ లెవరు అతనికి ఆశ్రయమీయడానికి? వీరంతా గ్రామం క్రింద బ్రతకవలసినవారు గదా అన్న ఆలోచన తట్టింది.

నిజమాలోచిస్తే ఈ మనుషులు ఎంత వెర్రివారో తెలుస్తుంది.

రామదాసు ఎంత?

సంఘంలో అతని విలువెంత?

అతని స్థానం ఎంత?

అతన్నిగూర్చి గ్రామం గ్రామం ఎందుకంత ఆలోచించి విలువ నిస్తుందో వారికీ ఎవరికీ అర్థంకాదు.

అసలు ఒక సమస్యకు, ఒకమనిషి అవసరం గనుక ఆ అవసరం రామదాసు మీదుగా తీర్చుకున్నారు.

అదే ఏ నోరుగలవాడో, ఆస్థిగలవాడో ఐతే ఎదురు తిరిగినా తిరగవచ్చు.

అందువల్ల రామదాసునే వాడారు.

తండానుండి బయలుదేరిన తండా నాయకుడు సరాసరి గ్రామ పెద్ద ఇంటిముందు నిలిచాడు.

గ్రామపెద్ద అతన్నిచూసి. 'రాత్రి మీరంతా వచ్చి మా గ్రామాన్ని అవమానించారు.' అన్నాడు.

"అందుకే వచ్చాను. జరిగిందిదీ...." అని వివరించబోయాడు.

గ్రామపెద్ద 'నా కంతా తెలుసు' అన్నాడు.

తండా నాయకునికి రాత్రిఉన్న ఆవేశం ఇప్పుడు లేదు.

అదీకాక రాత్రి అంతా కలిసి యింక పనులుకూడా చెబుతామన్నారు.

ఆ ఆశ ఒకటి తండా నాయకునికి ఉంది.

"కాదు, బాబూ!" అన్నాడు.

'ఇంక మాట అనవసరం' అన్నాడు గ్రామపెద్ద, చెప్పదలి చింది వినిపించుకోకుండా।

తండా నాయకుడేమీ బదులు చెప్పలేదు.

అలాగే వెనుదిరిగి కాలువగట్టుకు బయలుదేరాడు.

ఊళ్ళోవాళ్ళు కూడా ఏమంత పట్టించుకున్నారు గాదు.

మామూలుగా రామదాసు తన కార్యక్రమాలన్నీ చేసుకుని పోతున్నాడు.

జిలానీ హృదయం పరిపూర్ణంగా రామదాసుమీద లగ్నమైంది. రామదాసే సర్వస్వంగా భావించింది.

దానికి తగినట్టు సాయంత్రం పూట రాందాసు ఆమెకు భాగవతం చదివి చెప్పేవాడు.

అదామె అర్థం చేసుకునేది.

మధ్యాహ్నమైన దగ్గరనుండి జిలానీ అతని దగ్గరే ఉండేది.

తిరిగి పొలం పనులు ఆరంభమయ్యాయ్. తండాలో వారంతా తలో పనీ చేసే వాళ్ళు. జిలానీ వయసులో ఉన్న నలుగురూ ముగ్గురూ వెళ్ళేవాళ్ళు కాదు.

వారికి చదువు మీద ఆసక్తి లేదు.

వారి సంస్కారం అంతవరకే. పిల్లలను చదివించుకోవాలని కూడా వారికి తెలియదు.

వారికే ఏమిటి? ఆ నాడు గ్రామంలోవారికీ అంతే. ఊరు మొత్తం మీద తిరుగవేస్తే నలుగురో ఐదుగురో చదువుకున్న వాళ్ళుండేవాళ్ళు.

ఎవరికి ఏ అవసరం వచ్చినా వారి దగ్గరకు వెళ్ళవలసిందే. అంతా ఎందుకు, గ్రామ పెద్దకు చదువురాదు. పెత్తందారు, తీర్పరీ అతడే. ఐనా అక్షరం తెలియదు

అతడు అన్ని గ్రామాలవారికీ న్యాయం చెప్పగలడు. చెబుతాడు కూడాను.

జిలానీ దాదాపు రామదాసు పాడే పాటలన్నీ పాడేది.

ఒకో రోజు బాగా ప్రొద్దుపోయేదాకా రాందాసు గుడిశలోనే ఉండేది.

ఎవ్వరూ అదేమని అడిగేవాళ్ళు గాదు.

అది రామదాసు మీదున్న నమ్మకం.

ఆమెను వెళ్ళవద్దని అనే వాళ్ళు గాదు.

ఎవరికీ ఏ విధమైన అభిప్రాయం లేదు, వారిద్దరూ కలిసి ఉండటంలో.

నిజానికి రామదాసు జిలానీని బిడ్డలాగా, భక్తురాలులాగా, ఏమీ తెలియనిదానిలాగా చూచేవాడు.

అతని మనస్సు బాగా పండిపోయిన ముసలిది.

అతని వయసును చూపేదేగాదు

అందువల్లనే చూచేవారు- వీరు ఏకాంతంగా ఉన్నా, ఎలా ఉన్నా ఏమీ అనేవారు గాదు.

ఒకో రోజు మధ్యాహ్నం వేళల్లో, తలలో పేలు చూచేది జిలానీ.

అరుగు క్రింద రామదాసు కూర్చుండేవాడు.

అరుగుమీద జిలానీ కూర్చుండేది.

ఆమె రెండు కాళ్ళ మధ్య అతని వీపు ఉండేది.

ఆ చేతులు తల ముందు భాగానికి వచ్చేప్పుడు అతని తల ఆమె వక్షానికానేది.

అదే బాబూ, ఆ జిలానీ అందుకున్న స్పర్శాసుఖం అతనితో.

అందులోనూ అతని మనస్సు లేదు.

అది ఒక్క జిలానీకి తెలుసు, సుఖం యిదీ అని.

అతడు పసివానిలా ముసలివానిలా తన నిడుపాటి కేశాలు. తలా ఆమె చేతిలోబెట్టి ఏదో ఆలోచించేవాడు.

ఆ ఆలోచన ఈ ఇహాన్ని గూర్చి కాదు.

ఎక్కడో పరంతోనిది. లేక రామయ్యా, సీతమ్మ అడవుల్లో ఎలా ఉండేవాళ్ళు అన్నదేదోగాని, తన తలపు ఒక వయసు పిల్ల శరీరం తగులుతుందని—లేములాంటి హస్తాల్లో నా తల ఉందని, సుతిమెత్తని ఉడుకు నెత్తురు వారే యౌవ్వన ఊరువుల మధ్యనున్నానని గాని. అతదెప్పుడూ అనుకోలేదు.

గుడిశ ముందుగా కూలికి వెళ్ళే లంబాడీలుగాని, వెళ్ళి వస్తున్న

లంబాడీలుగాని ఎవ్వరూ ఏమీ అనుకోరు.ఆ వయసులో ఉన్నవారిద్దరు-మరొకరెవరైనా అలా ఉంటే ఈ సంఘం- ఈ లోకం తొంగి తొంగి చూచి, కట్టవలసినదంతా కట్టి, గత్తరచేసి వారిద్దరినీ నానా రభసపాలు చేసేదే.

కానీ వారిద్దరి వాలకంలో అవి లేనేలేదు.

ఎవరి కంటా పడింది కాదు.

ఎవరూ ఆ విషయం పట్టించుకోలేదు.

అనుకోలేదు.

ఆమె చేతులు తగిలినా, ఆమె ఊరువులు తగిలినా, ఆమె యౌవ్వనంలో ఉన్నా. అందంగా ఉన్నా ఆ రామదాసు మనస్సులో చలనం లేదు.

నెత్తురు వేడెక్కలేదు.

కోరికలతో ఉక్కిరిబిక్కిరి కాలేదు.

అసలా కాంక్ష అతని లోనికి రాలేదు.

అసలా సుఖమంటూ ఒకటుంటుందని, జీవరాసులు అందుకుంటాయని, అందుకోవాలని, అది సృష్టిని పెంచడానికి మానవులు చేయవలసిన విధి అని అతని తలపులో ఎప్పుడూ మెదలలేదు.

పైగా అటు వెళుతూ వెళుతూ వారిని చూచి లంబాడీల్లో కొందరు పరాచికాలకి—

"ఏంవే! మొగుడు తల్లో పేలు కుక్కుతున్నావా" అనేవాళ్ళు.

అది విన్న జిలానీ ఒళ్ళంతా పులకరించేది.

రామదాసు 'అన్నన్నా, ఎంత మాట! అమ్మడూ ఎప్పుడూ అలా అనకు.' అనేవాడు.

అదీ సర్వసాధారణంగా-

ఆ లంబాడీ చిరునవ్వుతో 'ఊర్కోనే దాన్ని ఉడికించాలని అన్నాలే' అని, తన దారిన తాను పోయేది.

రామదాసు అన్న మాట జిలానీని వేధించేది.

ఎన్నోసార్లు రామదాసును 'రామదాసూ! నువ్వు పెళ్ళి చేసుకోవా?' అని అడగాలనుకొని అడగలేక సిగ్గుతో తల మున్కలై పోయేది ఆ అమాయక జిలానీ.

ఆ అవస్థకు అర్థం తెలియక తన్మయత్వంలో—

'రాందాసూ! నేను చచ్చిపోతే నీవేం చేస్తావూ?' అన్నది.

రామదాసు ఆమె తలను నిమురుతూ—

'అమ్మడూ! అలాంటి పిచ్చి పిచ్చి ఊహలు నీకెందుకొస్తాయే! నీకు పెళ్ళి కావాలి. పిల్లల్ని కనాలి. లోకంలో నీ పిల్లలు రామయ్య తండ్రి దయతో మంచి కార్యాలు చేయాలి.' అన్నాడు.

'ఏమో రాందాసూ! నిన్ను వదిలి చచ్చిపోతానేమోనని భయంగా ఉంది' అంది.

"నాదేముందే పిచ్చితల్లీ! నేను వేరూ, నీవు వేరుగా నా రామయ్య తండ్రి చూస్తాడా? మనిద్దరినీ సమంగానే చూస్తాడు. ఆయనకి భేదం లేదు. అంతా ఆయన బిడ్డలం" అన్నాడు.

ఆ మాటలు విని జిలానీ పొంగిపోయింది.

ఆ పొంగిపోయిన హృదయంతోనే, "రాందాసూ! మనసిచ్చిన వాళ్ళ కోసం అందరినీ వదలి ఆళ్ళతో లేచి పోవటం మంచిదంటావా?" అని అడిగింది.

రామదాసు కా లేచిపోవడాలు, మనసీయడాలూ ఏం తెలుసు?

అలా మనసిచ్చి లేచి పోయిన సంఘటన ఒకటి కనిపించింది.

అక్కడే కూర్చుని మెల్లగా, "తప్పేముంది - రుక్మిణీదేవి శ్రీకృష్ణ పరమాత్మతో అలాగే లేచిపోయింది." అన్నాడు.

"చెప్పు రాందాసూ! అది" అని అడిగింది.

ఆమె ఎందుకడుగుతుందో అతని కనవసరం.

జరిగినది జరిగినట్టు చెప్పడమే అతనికి తెలిసింది.

అతడు చెప్పడం మొదలుపెట్టాడు.

రుక్మిణీ కళ్యాణకథ అంతా విని—

"రుక్మిణీ అమ్మవారు శ్రీకృష్ణభగవానుణ్ణి వలచి సరిగ్గా, పెళ్ళి నాడు లేచిపోయిందా! అంది జిలానీ.

"అంటే ఆయన దేవుడైన మహావిష్ణువు. ఆమె లక్ష్మీదేవి. ఆయన కోసమే ఆమె పుట్టింది. అందుకనే అన్నను, తండ్రినీ, అందరినీ వదలి భగవానుడు రథం తేగానే ఎక్కి వెళ్ళి పోయింది. అంత అదృష్టం ఎందరికుంటుంది?" అన్నాడు రామదాసు.

"అవును రాందాసూ! ఎందరికి దొరుకుతుంది-అనుకున్నవాడు మొగుడుగా కావడం?" అంది జిలాని.

అలాంటి సంఘటనలు అతడనేవన్నీ ఆమె హృదయంలో నిలచి పోయాయి.

వాటితో ఆమె కొర్కెలను పెంచుకునేది.

ఆ కోరికల కోటలలో ఏవేవో నందన వనాలు సృష్టించుకొని, తన హృదయాన్ని రాణిగా చేసుకొని ఆనంద విహారాలు చేసేది ఊహాలోకంలో జిలానీ.

ఏ పండుగో వస్తే రామదాసుకు తలంటేది.

తన చేతులతో వంటకాలు అందించేది.

రామదాసుతో ఆమె అందుకున్న సుఖం, సౌఖ్యం, ఆనందం అంతా అలాంటిదే.

ఆ కన్నె పడుచు రామదాసు కోసమే జీవించేది.

రామదాసు మాత్రం లోకులందరి కొరకూ బ్రతికాడు.

తను తిరిగి తెచ్చిన గింజల్లో తనకుపోను మిగిలినవి తండా వారికే యిచ్చేవాడు.

అదీ జిలానీ చేతిమీదుగానే యీయడం జరిగేది.

ఇలా నీకు యెన్నని చెప్పేది!

ఆమె హృదయాన్ని రామదాసుకు అంకితం చేసింది.

రామదాసు దాని విషయం పట్టించుకున్నవాడుగాదు.

రామదాసూ, జిలానీ యిలా ఉన్నా ఎవరికీ ఏమీ అనుమానం లేదన్నానుకదూ!

అది మంచిగానీ, చెడుగానీ ఒకోసారి పతనం కావడం జీవితాల్లో జరిగేదే!

ఆ పతనం ఎలా ఆరంభమైందో తెలుసా?

తండా నాయకుడు జిలానీకి పెళ్ళి చేయాలనుకున్నాడు. ఉండనే ఉంది తండాలోనే సంబంధం.

స్థిర వివాసాలేర్పరచుకొన్న తండాల్లో చాలావరకూ మహమ్మదీయ సాంప్రదాయమే ఉండేది.

అందులోనూ పూర్తిగా అదే కానూకాదు. కలగాపులగం!

ఇందులోనే కాదు, చాలా జాతుల్లో అంతే.

వారి వారి సాంప్రదాయాలు, పద్ధతులూ, వారున్న పరిసరాల బలం చాలావరకు మార్పులు, చేర్పులు చేస్తుంది.

అందువల్ల సంకర సాంప్రదాయం ఏర్పడుతుంది.

కావలసినవన్నీ ఏర్పరచాడు.

ఇవేవీ జిలానీకి తెలియదు.

జిలానీ హృదయం, కోరికలూ అన్నీ రామదాసువే.

ఆమెకు మరో అభిప్రాయం, ఆలోచించే తీరికా లేదు.

ఒకరోజు ఉదయం తండ్రి నాయకుడు ఎక్కడికో వెళుతుండగా అతని భార్య అన్నది—

'మరి నీవు రాత్రికి రావుకదా, అందరినీ పనులకు వెళ్ళవద్దని ఎవరు చెపుతారు?'

'ఉదయానికంతా వస్తానుకదా. చెప్పకూడదా? ఐనా ఎల్లుండి కదా పెళ్ళి!' అన్నాడు.

ఆ మాట జిలానీ విన్నది.

తండ్రి వెళ్ళిపోయాడు.

తల్లిని అడిగింది—

'ఎవరికే అమ్మా పెళ్ళి?' అని.

"పిచ్చి తల్లీ! ఎవరికో ఐతే మేమెందుకింత హడావుడి పడతాం? నీదే!' అంది దాపుకు తీసుకొని తల నిమురుతూ గోముగా.

జిలానీ పాదాల క్రింద భూమి పగిలిపోయింది.

'ఎవరితో?' అంది సన్నగా, తెలుసుకోవాలని లేకపోయినా తెలుసుకుందామని.

అప్పటి ఆమె ఊహ - పెళ్ళి లేకుండానే ఉండిపోదాం, ఎవర్నో ఎందుకు చేసుకోవాలి, వాడు రామదాసు దగ్గరకు పోనీయడు-అన్నదే భావన.

'ఎవరంటావేమే దైసీతోనే' అంది.

జిలానీ తొడుక్కున్న అద్దాల కంచుకు సడలింది.

పావడా ఒదులై ఊడిపోతున్నట్లనిపించింది.

ఆ తర్వాత ఆమెకు తెలియదు- 'అమ్మా!' అంది బిగ్గరగా—

అది చూచి తల్లి, కూతురు పెళ్ళిమాట విని ఆనందంతో అరచిందనుకుంది.

జిలానీకి ఏం చెప్పాలో తోచింది కాదు.

అంటానికైతే అమ్మా అని ఒక కేకవేసిందిగాని, నిలువుగుడ్లు పడిపోయాయి.

నిల్చున్నది నిల్చున్నట్లే కట్టెలా బిగుసుకుపోయింది.

ఆ చలనరహితమైన బిడ్డనుచూచితల్లి మొదటలో ఊరుకున్నా, ఆ తర్వాత గాభరాపడి—

'ఏమిటే? ఏమిటే?' అన్నది.

జిలానీ స్థాణువులా కొంతసేపు ఉండి తెప్పరిల్లి 'అన్నీ చేశారా?' అంది.

'ఏమిటే? అన్నీ చేశారా అంటావ్!' అనడిగింది తల్లి, ఆదుర్ధాగా తన కూతురు వెఱ్ఱి చూపులు చూస్తూందని భయపడుతూ.

"అదే, పెళ్ళికి కావలసినవన్నీను."

"చేసేదేముంది? అనుకుంటున్నాం. ఎంతసేపు చేయాలి!" అంది తల్లి.

"ఐతే ఈ పెళ్ళి ఆపించవే!"

"అదేమిటే, నీ కేమన్న వెఱ్ఱా?" అంది తల్లి.

"నాకు యిష్టంలేదు."

"అంటే?" అనడిగింది.

"అంటే ఏముంది, పెళ్ళి చేసుకోను."

"ఇప్పుడా? ఎప్పటికీనా?"

"అది వేరే విషయంతేవే!" అంది.

ఈ మాటలన్నీ చాలా గంభీరంగా, తూచి అంటున్నట్లుగా, ఏదో తెలియని అధికారంతో అన్నది జిలానీ.

ఆమె కళ్ళలోకి చూస్తూ జిలానీని ఏమీ అనలేక, నోరెత్తి మాట్లాడలేక అలాగే ఉండిపోయింది తల్లి.

ఆమె లోలోనే అనుకుంది-ఒక్క రాందాసు తప్ప మరొకరెవ్వరూ దానిని ఒప్పించలేరని.

ఏదైనా,ఏమైనా దానితండ్రి వచ్చాక చేయవలసినదేనని జిలాపి తల్లి అప్పటికి ఊరుకుంది.

జిలానీకి పిచ్చెక్కినట్లుగా ఉంది.

ఎక్కడకూ పోలేదు.

రామదాసు గుడిశకు పోలేదు.

అతనికి కావలసినవేవీ చేయలేదు.

ఏవో ఆలోచన!

తనను గూర్చి తనకే తెలియని ఆలోచన!

ఏం చేయాలి?

ఏమీ తోచదు.

అసలు తను రామదాసుకు మనసిచ్చినట్టు రామదాసుకెన్నడైనా చెప్పానా అని ప్రశ్నించుకుంది. 'లేదు' అని సమాధానం వచ్చింది.

పోనీ రామదాసు ఎన్నడయినా పెళ్ళి ప్రసక్తితెచ్చాడా అనుకుంది.

దానికీ సమాధానం రాలేదు.

రామదాసును ఎన్నడైనా మనం పెళ్ళి చేసుకుందాం అని అడిగానా- లేదు-అని మనస్సు చెప్పింది.

ఏం చేయాలిప్పుడు?

రామదాసునే అడిగితే?

అతడేం చెప్పగలడు?

మొదటినుండీ అన్నీ ఆమెలో గిరగిర తిరిగిపోసాగాయి చిత్రంగా.

ఆ విచిత్ర భ్రమణంలో ఏది ఏదో, ఏది తేలాలో, ఏది ఆగాలో తెలియలేదు.

రామదాసు తన గుడిశకు వచ్చాడు.

అప్పటికే ఎదురుచూచే జిలానీ ఎదురు రాలేదు.

ఆమె ఎందుకు రాలేదు?-అని ఆలోచించాడు.

కాసేపు చూచాడు.

ఏదో తక్కువ తనంగా తోచింది.

ఆ ప్రక్కనుండి పోతున్న తండాలోని ఒక పిల్లను పిలిచి, "అమ్మ దేదీ? అని అడిగాడు.

"ఇంట్లో ఉందేమో పిలవనా?" అంది.

'ఒద్దులే' అని తనకు కావలసిన నాలుగు గింజలు కడిగి పొయ్యి మీద పెట్టి ఉడకవేసుకోడంలో లీనమయ్యాడు.

రామదాసు గొంతు గట్టుమీద ఉండగానే వింది జిలానీ.

రావాలా, రాకూడదా అన్న మీమాంసలో ఆమె హృదయం కొట్టుమిట్టాడింది.

అలా కొట్టుమిట్టాడుతూ అక్కడే ఉండిపోయింది గాని, ఎందుకో రావడానికి భయం కలిగింది.

రాలేకపోయింది.

రామదాసు హృదయం ఆమె కోసం దేవులాట సాగించింది.

దీనికి మరో కారణమేమీ లేదు.

రోజూ వచ్చేది, రోజూ కనిపించేది ఏదైనా సరే రాకపోయినా, కనిపించకపోయినా పడే ఆవేదన అది.

అది తెలియదు.

దానికి కారణం దొరకదు.

కారణ రహితమైన వాంఛ.

కారణం తెలియని కోరిక.

ఆమె రాకపోయినా ఆగిపోయేది లేదు.

ఆగేది లేదు. ఐనా అతడు బాధపడ్డాడు.

ఆ బాధలోనే ఏదో తెలియని సమస్య ఒకటి కలిగింది.

దానికి సమాధానం రాదని అతనికీ తెలుసు.

జిలానీ రోజూ రావాలా? అనుకున్నాడు.

వచ్చేదిగా! అన్న సమాధానం తప్ప మరొకటి రాలేదు.

తర్వాత తనకుతానే సమాధానం చెప్పుకొని ఊరుకున్నాడు.

ఆరోజంతా జిలానీ అతనికి కనిపించలేదు.

రాత్రివరకూ కూడా జిలానీ వెళ్ళిందిగాదు.

మరునాడు మామూలుగానే తన చెంబు తోముకొని భజన చెక్కలూ, తంబురా తీసుకొని, రమారమణ గోవిందో హరి అని పాట మొదలెట్టాడు.

జిలానీ రాందాసు పాట వినిపించినంతవరకూ విన్నది.

ఆ తర్వాత రామదాసు దూరంగా వెళ్ళిపోయాడు.

గొంతు ఓంకారాన్ని జపిస్తున్న రీతిగా శబ్దాన్ని అందించింది.

వింటున్న జిలానీ అప్పటివరకు తన హృదయాన్ని కట్టు దిట్టంలో ఉంచుకోవాలనుకున్నది. అక్కడ నిల్వలేక, సరాసరి రామదాసు గుడిశకు వచ్చి గుడిశలో కూలిపోయి ఏడ్వడం మొదలుపెట్టింది. ఏం చేయాలో తోచదు.

రామదాసుకు తన హృదయాన్ని చెప్పాలని లోపల వూహ.

ఎలా చెప్పాలో పాలుపోలేదు.

ఏం చేయాలో తెలియదు.

ఇంతకుముందు చూచాయగానైనా తెలియచెప్పి వుంటే యీ నాడింత బాధ ఉండేది కాదు.

అసలు యిలాంటి విషయాలను గూర్చి రామదాసు ఎలా వుంటాడో తెలియదు.

ఒక ప్రక్కనుండి తన హృదయ కలశంలో రామదాసనే అమృతాన్ని నింపుకొంది.

వయస్సనే యెండలో, జీవితమనే బాటలో ప్రయాణంచేస్తోంది.

ఆమెకెంతో దాహంగా వుంది.

ఆ కలశంలో ఉన్న అమృతాన్ని త్రాగడానికి ప్రయత్నం.

అది దప్పినారుస్తుందో లేదో ఆమెకు తెలియదు.

తనతో ప్రయాణిస్తున్న తండ్రి అమృతాన్ని ఒలకబోసి ఏదో మంచి నీటినే ఈయదలిచాడు.

ఎలా?

తనకు కావల్సింది ఒక్క దాహం తీరడమే కాదు.

ఇంకా ఏదో కావాలి.

అది యిదని ఆమెకు తెలియదు.

అదే రామదాసు అన్న భావనలో వుంది జిలానీ.

రామదాసు నెన్నుకోడంవలన దప్పి తీరుతుందో లేదో గాని, ఆత్మ సంతృప్తి-ఆత్మకు కావలసినదంతా అందుతుంది.

తండ్రి సమకూర్చినది దాహాన్ని మాత్రం తీర్చగలదు, పద బడిన ఒడలికి శాంతి-అంతవరకే.

రామదాసు రెండూ తీర్చగలడేమో!
ఏది ఏమైనా తనకు రామదాసే కావాలి.
రామదాసు లేని జీవితం నరకం.
ఆ నరకం నా కక్కరలేదు.
నాకు కావల్సింది రామదాసు-అన్న నిశ్చయానికి వచ్చింది.
అంతలో తండ్రి గుడిశ ముందునుండి వెళ్ళడం కనిపించింది.
ఎక్కడికి వెళ్ళాడో ఇప్పుడొస్తున్నాడు.
ఆయన నిరంతర శ్రమ ఎవరి కొరకు?.... నా కొరకు.
నేను లేకుంటే ఆయనంతగా శ్రమించి, దాచవలసిన పని లేదు.

నాకు ద్రోహం చేయాలని ఆయన ఏనాడూ అనుకోలేదు.

నా మంచికి, నా శ్రేయస్సు కొరకే కదా ఆయన శ్రమించి దాస్తున్నాడు. ఎవరున్నారు?.... అన్నీ నేనే.

ఆ ముసలితనంలో ఈ విషయం తెలిస్తే ఎంత బాధ పడతాడు!
అమ్మ యిల్లు చేరగానే చెపుతుంది.
ఆయన గుండె ఆగిపోదా!
అయ్యో నేనెందుకు తూలానబ్బా!
అమ్మ చెపుతుంది.
ఆయనకు బాధ కలుగుతుంది.
ఆ బాధను కోపంతో జోడించి నన్ను దండిస్తాడు.

కనీ, పెంచీ పెద్ద చేసినందుకు నా కోసం సర్వసుఖాలు త్యాగం చేయదలచిన వారికోసం నేను రామదాసునెందుకు వదులుకోగూడదు!

రామదాసునా?
ఎలా?
వదులుకోలేను.
రామదాసు లేకుంటే?

రామదాసు.... రామదాసు నా హృదయం. నా ప్రాణం, ఇన్నాళ్ళూ నీరుపోసి పెంచిన లత.

దానినెలా త్రుంచి పారవేసేది?

ఒకవంక తల్లి తను చెప్పినవి చెపుతుందని, రెండోవంక తను

రామదాసును వదులుకోలేక, మరోవంక తండ్రిబాధ, మరోవంక రామదాసును ఈ లంబాడీలు ఏం చేస్తారోననే బెంగ.

ఆ క్షణంలో లోకమంతా చీకటైపోతున్నంత బాధ కలిగింది.

అలానే ఉండిపోయింది.

తండాలో ఎవ్వరూ లేరు. అంతా పనుల్లోకి వెళ్ళారు.

తండా నాయకుడు లోనికి అడుగుపెట్టగానే నాయకుని భార్య కూతురు చెప్పినవన్నీ చెప్పింది.

తండా నాయకుడు క్షణం మాట్లాడలేకపోయి, ఆ తర్వాత తిరిగి భార్యచేత అంతా చెప్పించుకొని విని-

"అమ్మాయేది?" అనడిగాడు.

"రాందాసు గుడిశెలో ఉందేమో!" అంది.

నాయకుడు సరాసరి రాందాసు గుడిశెలోకి వచ్చి నిలచాడు.

జిలానీ తండ్రి వస్తున్న సంగతి తెలుసుకోలేదు.

అతడలా వచ్చి నిలిచిన విషయంకూడా తెలియలేదు.

అలాగే నిలిచి వున్నాడతడు.

ఆమె మూర్తీభవించిన శోకంతో రాయిలా,కుందనపుబొమ్మలా అలాగే ఎటో చూస్తూ, ఏవో ఆలోచిస్తూ అలా ఉండడం చూచిన తండా నాయకుని గుండె కూడా గుభేలుమన్నది.

"అమ్మాయ్!" అన్నాడు సర్వసాధారణంగా, సౌమ్యంగా.

అది జిలానీకి ప్రక్కన పిడుగుపడినట్లుగా వినిపించింది.

భయంతో వణికిపోయింది.

తలనెత్తి చూచింది.

నాయకునిలో ఏ మార్పూలేదు.

కానీ, జిలానీకి కనిపించడం మాత్రం వికృతంగా, రాక్షసాకారంగా కనిపించింది.

ఆ భయంలోనే ఏదో నిశ్చయానికి వచ్చింది.

అది నిశ్చయానికి రావడం కాదు, తెగింపుకు-

ఏది ఏమైనా సరే పట్టువిడువను- అన్న రీతికి రావడం.

నాయకుడు కూతురు వాలకం చూచి చాలా ఆశ్చర్యపోయాడు.

ఎప్పుడూ నవ్వుతూ ఉండేదామె. అలాంటిది అలా మారిపోవ డానికి బలమైన కారణం ఏదో ఉందనుకున్నాడు.

"ఏమమ్మా, అలా ఉన్నావు?" అన్నాడు.

"ఏం లేదు బాబా!" అంది.

"ఉఁ" అన్నాడు.

ఆ ఊ అనడం-నీ విషయమంతా చాలా ముదిరిపోయింది. పన్ను ఎదిరించేవరకూ వచ్చావన్నమాట- అన్న తీరులో ఉంది.

దానికి జిలానీ లోలోనే ఉడికిపోయింది గాని, వెలికి ఏమీ అనలేదు. అతడే తిరిగి—

"మీ అమ్మ ఏదో అంటుంది. నిజమేనా అమ్మా?" అన్నాడు విదానంగా.

కానీ అందులో ఏదో కృత్రిమం ఉంది అనుకుంది జిలానీ.

ఒకోసారి ఎవరికివారు ఎదటివారిని అర్థంచేసుకోలేక, తప్పు భావనలో పడి, తప్పు అభిప్రాయాలకు వచ్చి వారినీ. యెదటివారిని కూడా నాశనం చేస్తారు.

పరిస్థితులు కల్పించేవి చాలా బలంగలవై పోతాయి. ఆ పరిస్థితుల ప్రాభవానికి సంఘటనలు జోడై, మనుష్యలను మార్చి వేస్తాయి.

దానితో వారు తప్పు నిర్ణయాలను ఒప్పుగా భావించి, తమంత తామే తిప్పలు తెచ్చుకుంటారు.

ఆమె తల ఊపింది.

"ఐతే నీవు పెళ్ళిచేసుకోవా?"

జిలానీ మాట్లాడలేదు!

"దైసీని చేసుకోవా? ఎవ్వరినీ చేసుకోవా!" అన్నాడు

ఏఁవిటీ ఈ ప్రశ్నలు! అనిపించింది జిలానీకి.

దానికికూడా ఆమె మౌనంగా ఊరుకుంది.

"నీ మనస్సులో ఏముందో చెప్పు?" అనడిగాడు,

జిలానీ అంతకుముందే నిర్ణయించుకున్నది కాబట్టి, "దైసీని చేసుకోను," అన్నది.

"ఏం?" అన్నాడు.

"నాకిష్టంలేదు." అంది జిలానీ.

ఆ మాటతో నాయకునిలోని సహనం పోయింది.

"ఎవణ్ణి చేసుకుంటావ్?" అన్నాడు కటువుగా.

జిలానీలోని అహం మాత్రం ఊరుకుంటుందా?

"అదంతా తర్వాత," అన్నది లెక్కచేయని రీతిలో.

నాయకుడు ఆలోచించి, చప్పున చల్లారిపోయి, తనకు తెలియకుండా ఏదో జరుగుతుందని, తండాలోని కుర్రకారునంతా మనస్సులో ఒకసారి మననం చేసుకుని, వారి రూపులు చూచుకుని దైసీకన్న బాగున్నవాడెవడా అని ఆలోచించడం మొదలుపెట్టి, అసలు ఆమె ఏ తీరులో ఉందో నెమ్మదిగా తెలుసుకోవాలని—

"ఎవర్ని చేసుకోవాలని ఉందో, అదైనా చెప్పు," అన్నాడు.

ఒక్కక్షణం తండ్రి ముఖంలోనికి చూచి, "రాందాసును" అంది.

"రాందాసునా" అన్నాడు.

అన్నాడుగాని అతని తల తిరిగిపోయింది.

ఇందులో అతని ప్రమేయంఎంతవున్నదా అని ఆలోచించాడు.

రామదాసు సాధుస్వభావం, ఏమీ తెలియనితనం. అమాయకమైన ఆ చూపులు- పరమ భక్తుడు.

అతనికి ఇలాంటి దుర్బుద్ధులుంటాయా?

ఉండడానికి వీల్లేదని అతని ఆత్మ ప్రబోధించింది.

అతను తండాకు వచ్చిన దగ్గరనుండి అంతా అతను మనస్సులో ఊహించుకున్నాడు.

ఎక్కడా అతని నడవడికలో, మాటలో, పలుకులో-ఏ కోణం నుండి చూచినా అపరాధం కనిపించలేదు.

ఇది జిలానీ ప్రోద్బలమై ఉంటుందనుకున్నాడు.

"అతన్నడిగావా? అతను ఒప్పుకున్నాడా?" అన్నాడు తిరిగి.

ఆ అనే తీరులో, వాడెలా ఒప్పుకున్నాడు? నరికి పోగులు పోస్తాను! వాడెవడు? అసలు నువ్వెందుకు అడిగావు అన్న తీరు వినిపించింది జిలానీకి.

ఆమెలో భయం కలిగింది.

అతడన్నాడన్నా, మరోమాట ఏదన్నా రామదాసును దండి స్తాడు అనుకొని, నిజాన్ని చెప్పదలచి-

"అనలేదు. అడిగి ఒప్పించాలి" అంది.

తండా నాయకుని తల పనిచేయడం మానివేసింది.

ఏదో బాధ- తెలియని పోరాటం సాగుతుంది అతని హృదయంలో.

ఇదెక్కడి అన్యాయం?

దిక్కులేనివాడికి గుడిశ వేసి ఉండమంటే- తన నెత్తురులోని భాగం ఏదో చేస్తూంది.

అతని మతమేమిటి?

మన మతమేమిటి?

అతని కులమేమిటి?

మన కులమేమిటి?

అతడెవరు?

మనం ఎవరు?

ఏమిటీ మాయ?

ఏదో జరిగింది అనుకున్నాడు ఆ బాధలోనే-

"అది కూడని పనమ్మా! మంచిదికాదు," అన్నాడు నాయకుడు.

"ఇందులో తప్పేముంది?" అంది జిలాని,

ఆమెకు ఏది వచ్చినా అందుకుందే బలం వచ్చింది.

బెదరించిగాని, మరో విధంగా గాని తన హృదయాన్ని ఎవ్వరూ మార్చలేరు అన్నరీతికి వచ్చింది.

నాయకుడు చివాలున వెలుపలకు వచ్చాడు. అలా కాలువగట్టుకు వెళ్ళాడు.

తిరిగి తండాకు వచ్చాడు.

అతనికేమీ తోచడం లేదు.

ఏదో బాధ—

తన గౌరవం, తన తీరు, తన తండా అంతా నాశనమై పోతున్నట్టు, తండాలోని వారంతా ఏదో ఎగతాళి చేస్తున్నట్టుగా ఉంది.

అది ఏ రకమైన ఎగతాళో తెలియడం లేదు.
తన కూతురు- తన కడుపున చెడబుట్టింది.
అసలీ రాందాసెవడు?
దాని మనస్సునలా ఎలా విరిచివేశాడు?
వాడు చేసినదేముంది?
ఏమీ చేసి ఉంతడు.
పిల్లదే వాడి పాటలకు, వాడి మాటలకు మనసుపడి ఉంటుంది.
అంతేగాని, మరోలా జరిగి ఉండదు.
జరగడానికి వీలులేదు.
అతన్నేమీ అనలేం.
అనడాని కాస్కారంలేని మనిషి.

ఈ ప్రమాదం తప్పాలంటే అతన్ని దాని కళ్ళకు కనబడకుండా చేయాలి. చేస్తేగాని కొన్నాళ్ళకైనా ఇది నా కూతురనిపించదు. అని ఆలా ఆలోచించి-

ఎలా మాన్పించాలి?
అతన్నేమీ అనకూడదు.
అతనితోనే దానికి చెప్పిస్తే?
అది వినదు.
వినే తీరులో కనిపించడం లేదు.
ఐనా రామదాసు చెపుతాడా?
అతనే ఉద్దేశంలో ఉన్నాడో.

బహుశా ఇద్దరూ కూడబలుక్కొనే ఈ తీరుకువచ్చి ఉంటారేమో, ఎవర్నీ నమ్మడానికి వీల్లేదు అనుకున్నాడు. తిరిగి అతని మనస్సులో, రామదాసు అలాంటి వాడు కాదు అని ఒక మూలనుండి ఘోషిస్తూనే ఉంది. అతనికి ఇతమిద్ధమని తెలియ రావడంలేదు.

ఏం చేయాలి?
ఏమీ తోచదు.
అతని తల పగిలి పోతున్నట్టుగా ఉంది.
మధ్యాహ్నం అవుతుందనగా రామదాసు గళం—
"హే రామచంద్ర ప్రభో!." అని వినిపించింది గట్టుమీద.

నిర్మలంగా ఆ రామభక్తుడు రామా అని కేకవేస్తూ వస్తున్నాడు.
అతని మనస్సులో ఏ కుట్రా, ఏ కల్మషం లేదు.
అలాంటి వాడితో ఏమ్మాట్లాడేది!
అతన్నేమడిగేది!ఇలా, అనుకొని సంధ్యంతా గడిపి—
చీకటి పడుతుండగా రామదాసు గుడిశ దాపుకు చేరాడు తండా నాయకుడు.
తండానాయకుడు రావడం చూచి—
'రా, రా, కనిపించడం లేదేం?' అన్నాడు.
ఎలా చెప్పగలడు-జరిగినదిదీ, జరుగుతున్నదిదీ అని?
ఎదటబడి చెప్పలేకపోయాడు.
తిరిగి రామదాసే అడిగాడు.—
"ఏమిటీ అలా ఉన్నావు? ఏం జరిగింది?" అని.
దానికీ తండానాయకుడు సమాధానమీయలేదు,
"మనస్సు బాగా లేదా? చిన్న చిన్న విషయాలు పట్టించుకోకు. వాటి కోసం బాధ పడకు. ఏమిటో రామయ్య తండ్రి మనకీ జన్మ నిచ్చాడు. దాన్ని బాధ పెట్టి, బాధ పడడానికి గాదు. ఉన్న దానిలో, ఉన్నంతలో హాయిగా అనుభవించడానికి, ఆనందంగా ఉండడానికి. అన్నీ మనవేనని మీద వేసుకొని ఎందుకూ బాధ పడడం చెప్పు! కాసేపు రామయ్య కథ చెప్పనా. కొంచం ఉపశాంతిగా ఉంటుంది." అన్నాడు.
తండా నాయకునికది నచ్చింది. ఏమీ అనలేక 'ఊ' అన్నాడు. రామదాసు అలాగే అరుగు మీద కూలబడి—
సుందరకాండను పాడి వినిపించాడు.
తండా నాయకుడు అంతా విన్నాడు.
మాటాడలేక పోయినాడు.
గతంలోలాగా అతనికి నిద్దుర రాలేదు,
కథ పొంతం ఆలకించాడు గాని, కన్నులరమూయలేదు.
రామదాసది గమనించి,
ఏమిటిది?
పూర్వం పాటలు వింటూ నిద్రపోయేవాడు. ఈనాడు నిద్ర

పోలేదు సరిగదా కన్నులరమూయలేదు, ఏదో బాధపడుతున్నాడు అనుకున్నాడు. అనుకుని ప్రక్కగా వచ్చి కూర్చుని—

"బాబూ! ఏమిటి నీ బాధ. నా కర్థంకావడం లేదు. బాధపడకు. నీలో నీవు కుమిలిపోతున్నట్టున్నావు. అంతా రామయ్య తండ్రిమీద భారంవెయ్యి. మనం బ్రతుకు బరువు, ఆలోచనాభారం ఎన్ని బరువులను నెత్తి కెత్తుకొని మనగలం? అందుకని కొంత రామయ్య తండ్రిమీద పారవేస్తే మన బ్రతుకు తేలికవుతుంది. ఎందుకూ ఆలోచన!" అన్నాడు రామదాసు.

తండానాయకుడు సమాధానం చెప్పకుండా వెళ్ళిపోయాడు.

ఏదో చెప్పాలనుకుంటాడు.

చెప్పడానికి నోరు రావడంలేదు.

ఏం చెప్పగలడు?

ఏమని చెప్పగలడు?

తనలో తాను కుమిలి పోవాలసిందే ననుకున్నాడు.

రామదాసీ విషయాన్ని గూర్చి ఏదో కొన్ని క్షణాలాలోచించి మామూలుగా లోనికివెళ్ళి పడుకున్నాడు.

ఉదయం తెల్లవారీ వారకముందే సంచారానికి వెళ్ళిపోయాడు.

తిరిగి మధ్యాహ్నానికి ఆ కేక వినిపించింది.

ఆ తర్వాత రామదాసు మామూలుగా తన గుడిశకు చేరాడు.

లోనున్న జిలానీ అతదొస్తున్నాడని తెలిసి తన గుడిశకు వెళ్ళి పోయింది.

ఏదో తప్పుచేసినట్టు. ఆమె ఆత్మ ఆమెను ఒకచోట నిల్వ నీయడం లేదు.

రామదాసును చూడకుండా, మాటాడకుండా గడపడం ఆమె కెంతో బాధగా ఉంది.

ఐనా ఆమె రామదాసును చూడ్డానికి బాధపడుతూ చూడలేక పోయింది.

రామదాసుకు కూడా ఏమీ పాలుపోలేదు.

నాలుగు రోజులు గడిచిపోయాయి. ఈ విషయం తండాలో ఎలాగో ప్రాకిపోయింది.

అందరికీ తెలిసింది.

అందరూ రామదాసునేమీ అనలేకపోయారు.

వారిద్దరెప్పుడైనా కలుసుకుంటారేమో చూడాలని పొంచి ఉన్నారు.

అదేమీ జరుగలేదు.

ఎవరి మనస్సుల్లో వాళ్ళు- నిప్పంటుకున్న గడ్డివాముల్లా కుమిలిపోయారు.

కుండలో ఉంచి దమ్మేసిన తేగల్లాగా ఉడికిపోయారు.

కాని ఎవరూ వెలికి అనలేదు, పొక్కలేదు.

రామదాసుకిదేమీ పట్టలేదు.

అతనికీ పరిస్థితులేమీ అర్థకావడం లేదు.

చేసుకోవాలన్న ఆపేక్ష, కాంక్ష అంతకన్నా లేవు.

ఏదో నాలుగూళ్ళు తిరిగి రావడం, అది ఉడకేసుకోవడం, తినడం. ఆ భారతమో, భాగవతమో చదువుకోవడం. ఉదయానికంతా వెళ్ళిపోవడం, మధ్యాహ్నానికి తిరిగి రావడం- ఇదీ అతని నిత్యకార్య క్రమం.

తండా నాయకుడు మధనపడ్డాడు.

పడుతున్నాడు.

పిచ్చెక్కి తిరిగాడు.

అలవాటుపడిన వారితో మునుపటిలా సంచరించలేకపోవడం వల్ల కలిగే బాధ ఎంతో తండానాయకుని కర్థమైంది.

అతడు కూడా కుమిలిపోతున్నాడు.

ఆఖరుకు రామదాసును తండా వదిలి వెళ్ళిపొమ్మని చెప్పా లన్నంత దిగజారి పోయాడు.

రెండుమూడు సార్లు అటుగా వెళ్ళి, అతడు ఏదో పుస్తకం చదవడం చూచి, అలా నిర్మలంగా ఉంటున్న అతన్ని ఎలా వెళ్ళమని చెప్పగలను అనుకొని, చెప్పలేక వచ్చేశాడు.

ఇదంతా అతని తప్పుకాదు. అంతా తన బిడ్డదేనన్న నిశ్చయా నికి వచ్చాడు.

# 6

ఆ రోజు రాత్రి జిలానీ గుడిశలోనే ఉంది.

ఆమె అసలు ఎక్కడికీ వెలికిపోవడం లేదు.

ఏదో బాధపడుతుంది.

ఆమె కన్నులలో మునుపటి కాంతి లేదు.

ముఖంలో చిలిపితనం లేదు.

పెదవులమీద చిరునవ్వులేదు.

దీపం వెలుగుతూంది.

తండా నాయకుడు లోనికి వచ్చాడు.

అనవసరంగా బాధపడడం దేనికని ఒక నిర్ణయానికి వచ్చి, తన కూతురును దండించి తన బాధ్యత తీర్చుకోవాలన్నదే అతని కోరిక.

ఆ రావడాన్ని గమనించింది జిలానీ।

ఏదో అడగాలని, ఏదో చేయాలన్న సంకల్పంతోనే వస్తున్నాడని ఆమెకు పూర్తిగా తెలిసిపోయింది.

అతడో నిశ్చయానికి వచ్చాడని ఊహించగానే, ఆమెలోనూ ఏదో ఆవేశం వచ్చింది.

అంతా పిచ్చి।

ఎవరూ కావాలని తప్పు చేయరు.

కానీ పరిస్థితులు?

ఎదటివా రిలా ఉన్నారు అనుకోవడంతో లోపలిగుణాలు కొన్ని విజృంభించి వారు చేసేవి వారికి తెలియనీయవు.

ఆ పొరపాట్లు సర్వ సాధారణం.

అవి మరోవాటికి సంబంధించనివైతే సర్దుకుపోతాయి,

అవే పెద తల పట్టినప్పుడు మారణంజరుపుతాయి జీవితాలను.

అతడు లోనికి వచ్చి—

"అమ్మాయ్!" అన్నాడు.

ఆ స్వరం విని ఆమెలో నున్న అహంకారం వెర్రితల లేపింది.

దానికి ఆమె సమాధానం ఈయలేదు.

దాంతో అతడు తన కూతురు తన్ను నిర్లక్ష్యం చేసిందను కున్నాడు.

"నిన్నే పిలిచేది! నీ ఉద్దేశం తేల్చిపారెయ్యి!" అన్నాడు.

ఆ మాట ఆమెకు కొరడా దెబ్బ తగిలినట్టుగా తగిలింది.

ఏమీ సమాధానం ఈయకుండా తలనెత్తి చూచింది.

"నిన్నే అడుగుతున్నాను. నాకు సరైన సమాధానం చెప్పు. ఎల్లుండికంతా పెళ్ళి జరిగి పోవాలి. ఏది ఏమైనా డైసీని నీవు చేసు కోవాలి" అన్నాడు.

"నా బొందిలో ప్రాణముండగా జరగదు." అనేసింది.

అలా అనాలని, అంటానని ఆమె కూడా అనుకోలేదు.

ఏమిటో ఆవేశం; తెలియని తనం. చెప్పరానిదేదో అలా అని పించిం దాక్షణంలో ఆమె చేత.

అది విన్న నాయకుడు ఒక్కసారి దిగ్భ్రమలో పడి తెప్పరిల్లి "అదీ చూస్తాను. అసలే నేను లంబాడోణ్ని. ఏది ఏమైనా సరే, లెక్క లేదు" అన్నాడు.

"నేనూ లంబాడీదాన్నే. అంత అవసరం వస్తే ఆ ఏట్లో పడి చస్తాను." అంది జిలాని.

ఆమె ఏమ్మాట్లాడుతుందో, ఎవరితో మాట్లాడుతుందో మరచి పోయింది.

ఇన్నాళ్ళబట్టి కడుపులో మరుగుతున్న వేదన తాలూకు పలుకులవి.

ఇద్దరిదీ అంతే.

ఆ ఇద్దరిదీ తప్పు లేదు.

పట్టుదలలు మాత్రమే.

"చీల్చి ఎండేస్తాను." అన్నాడు నాయకుడు.

"అలా చేసినా ఇష్టపడతాను. రామదాసును తప్ప మరొకర్ని చేసుకోను." అంది.

అది నిశ్చయం. తిరుగులేని నిర్ణయంలా అనిపించింది తండా నాయకునికి.

తండానాయకుని కది తల కొట్టేసినట్లనిపించింది. "ఇందరు తనను నాయకునిగా నిర్ణయించుకొని, పరాయి వాళ్ళు తన మాట వింటూ ఎదురు చెప్పడం లేదు. ఇది నా కడుపున పుట్టి నా కెదురు చెపుతుందా? చూస్తాను" అనుకున్నాడు. ఉరిమి చూచి, చూరులో ఉన్న చురకత్తి-కోళ్ళుకోసేదుంచే దాన్ని సర్రున లాగాడు.

అలా లాగ్గానే జిలానీ తల్లి-నాయకుని పెళ్ళాం వచ్చి ఎదురుగా ఆ ఇద్దరి మధ్య నిలచింది.

జిలానీ ఏమీ మాట్లాడలేదు.

నిర్భయంగా, నిబ్బరంగా అలాగే కూర్చుంది.

"ఛీ! దీనిని చంపడమేమిటా!" అనిపించింది తండానాయకు నికి, పెళ్ళాం మధ్య నిలవగానే.

అలా అనిపించగానే, "దీని మెడలు విరిచి ఎల్లుండికి పెళ్ళి చేస్తాను. ఎలా చేసుకోదో!" అన్న తలపు వచ్చి, ఆ లాగిన చుర కత్తిని గిరవాటు వేసి వెళ్ళిపోయాడు.

అనుకోకుండా అన్నీ కలిసివస్తాయి.

ఇలా జరిగినట్టు ఉదయాని కందరకూ తెలిసింది.

ఒక్క రామదాసుకే తెలియలేదు.

అతడు ఆ విషయాలేవీ పట్టించుకోలేదు కాబట్టి- ఏ మాత్రం ఆసక్తి చూపినా తెలిసేవే.

అతడేమిటో, అతని వాలకమేమిటో!

అంతే!

జరిగేది, జరుగుతున్నదీ అంతా అతన్ని గూర్చేకదా!

ఐతేయేం, ఆ విషయం అతను పట్టించుకోలేదు.

# 7

ఆతడు ఉదయం మామూలుగానే లేచాడు. "ఓ రామయ్యా!" అంటూ బయలుదేరి తన తంబూరా, భజన చెక్కలు సద్దుచేస్తూ. నెత్తిని రాగి చెంబు పెట్టుకుని వెళ్ళిపోయాడు.

ఎంత విచిత్రం!

జిలాని ఉడికి పోయింది.

ఈ రోజు ఎలాగయినా రామదాసుతో ఈ విషయం ముఖా ముఖి తేల్చుకోవాలి.

రామదాసు చేసుకోనూ అంటే కాలవలో పడి ప్రాణాలొదలా ల్సిందే గాని, మరో మార్గం లేదు అనుకొంది.

ఆ రోజు మధ్యాహ్నం వరకూ అతడికోసం చూసింది.

రాలేదు.

మరునాడు పెళ్ళి నిశ్చయించాడు తండ్రి'

తండా కంతా పిలిచి చెప్పాడు.

వరుడు చాలా ఉత్సాహంగా ఉన్నాడు.

అంతా ఉదయం పనుల్లోకి వెళుతూ, 'నాయకుని కూతురు పెళ్ళి రేపు. భలే!' అనుకున్నారు.

మధ్యాహ్నందాకా చూచినా రాందాసు రాలేదు.

ప్రొద్దు వాలిపోయింది.

చీకటయింది.

అప్పటివరకూ ఎప్పుడూ సంచారం చేయడు రాందాసు.

ఏమైందోనన్న భయం కలిగింది జిలానీకి.

ఉదయమే లేచి, నాలుక్కోసుల దూరానున్న పేటకు వెళ్ళాడు పెళ్ళికి కావలసిన వస్తువులు తేవడానికి తండానాయకుడు.

జిలానీ కళ్ళన్నీ అటే ఉన్నాయి.

కాలువ గట్టు వంకకే చూస్తూంది.

రాలేదు.

ప్రొద్దు పూర్తిగా వాలిపోయింది.

సందె వెలుగులు ఎఱ్ఱగా పడమటి తుమ్మల్లో కొండమీద వెలిగి పోతున్నాయ్.

కాలవలో నీళ్ళన్నీ ఎఱ్ఱగా ఉన్నాయి నెత్తురు పారుతున్నట్టు.

ఏదీ చప్పుడు కాకుండా ఉంది తండా అంతా.

ఇంకా పనుల్లోకి పోయిన వాళ్ళెవళ్ళూ రాలేదు.

కాలువగట్టు మీద రాందాసు గొంతు వినిపించింది.

అదెంత మాధుర్యమైంది.

దాని మాధుర్యాన్ని అందుకొంటూ గూళ్ళకుపోయే పిట్టలు చెట్లమీద నిలిచి ఆలించాయి.

బహుశా వాటికి భవిష్యత్తు తెలుసేమో!

తంబురా లయ పలుకుతూంది.

భజన చెక్కలు తాళం వేస్తున్నాయి.

పాట చరణం అందుకోబోతుండగా జిలానీ వచ్చి ఎదురుగా నిలిచింది. చూచి, పాటను ఆపాడు.

ఆమెను చూస్తూ, "అమ్మడూ అట్లా వున్నావేం?" అన్నాడు.

జిలానీకి ఏం చెప్పాలో తోచింది గాదు.

"ఏం అమ్మడూ అలా వున్నావు! ఆరోగ్యం బాగాలేదా? కనిపించడం మానావు. నేను నీకేం చేశానురా?" అన్నాడు.

జిలానీ ఏడ్వడం మొదలు పెట్టింది.

ఏడుస్తూనే—

"నీకేం తెలియదా రాందాసూ?" అన్నది!

"ఏమిటి? నాకేం తెలియందే?" అన్నాడు రాందాసు.

"నా పెళ్ళి విషయం నీకు తెలియదా?"

"నా కెవరు చెప్పారు? ఎవరూ రావడం లేదు. నాకు కనిపించడం లేదు. నీవూ రావడం మానుకున్నావు. ఆఁ, పోనీలే ఇవాళైనా కనిపించావు. ఎవరికిస్తానన్నాడు మీ బాబా?" అన్నాడు.

"డ్రైవర్ గాడికిస్తాడంట" అన్నదే గాని ఏడుపు ఆగింది గాదు.

పెద్దగా ఏడ్చింది.

దానితో అతడు తంబురా చేతిలోనుండి మార్చుకొని ఆమె తల నిమురుతూ—

"పిచ్చిదానా! పెళ్ళంటే ఏడుస్తారా" అని- ఆ రాయి లేదూ ఎదురుగా అక్కడకు తీసుకొని వెళ్ళి తల మీద చెంబు దించి, ఆమెను కూర్చో పెట్టి తనూ పక్కనే కూర్చొని—

"ఏడుస్తావేందుకమ్మడూ! వాడు నాకు తెలుసు. చాలా మంచి వాడు. రాముని దయ, అలాంటివాడు దొరకడం" అన్నాడు అమాయకంగా రాందాసు ఆమె ఆంతర్యం తెలియక.

"అది కాదు రాందాసూ! నేను.... నేను," అని ఆగిపోయింది.

ఇంతకాలం చెప్పలేనిది, ఇవాళ మాత్రం చప్పున ఎలా చెప్పాలో అర్థం కాక- తెలియక.

"ఏమిటీ చెప్పు నీ మనసులోనిది. రామయ్య దయ ఎలా ఉంటే అలా జరుగుతుంది, నేనూ నేనూ అంటావేం?" అన్నాడు. రామదాసు శాంతంగా.

"అదిగాదు రాందాసూ!" అంది తిరిగి ప్రసంగంలోకి లాగి చెప్పాలని.

"అసలేం జరిగిందమ్మడూ? ఏడుస్తావు- ఏమీ చెప్పలేక పోతున్నావు. అసలు విషయమేమిటి!" అన్నాడు.

"మా వాళ్ళంతా నీతో ఎందుకు మాట్లాడ్డంలేదో తెలుసా?" అన్నది అతని వంక చూస్తూ.

"నాకేం తెలుసు? ఆ రామయ్య ఎవళ్ళకేవేళకేం బుద్ధి పుట్టిస్తాడో, దానిదేముంది?" అన్నాడు.

"అది రామయ్య దయా, గీమయ్య దయా కాదు. రాందాసూ! నా వల్ల జరిగింది. నేను నిన్ను తప్ప మరొకర్ని చేసుకోనని కచ్చితంగా చెప్పాను. అందుకని." అంది.

ఆకసం అతని మీద విరుచుకుపడినంత బాధ కలిగింది.

దిగాలు పోయి, ఎన్నడూ అతని ఊహకు రానిది, ఊహించ లేనిది జరిగినట్టుగా ముఖం పెట్టి "నీ వన్నావా?" అన్నాడు.

"ఆఁ నేనే అన్నాను. అలాగే అనుకున్నాను. నిజం కూడా అదే।"

"ఎందుకన్నావు? నిన్ను నేను చేసుకుంటానని యెలా అనుకున్నావే? ఎంతపని చేశావు అమ్మడూ।" అన్నాడు బాధగా.

"నీ కిష్టం లేదా నేనంటే?" అనడిగింది జిలానీ వెల వెల బోతూ.

"అసలు నీకా వుద్దేశం ఎలా వచ్చింది. ఎందుకు వచ్చింది? నీకు పెళ్ళిచేసుకోడానికి నేనే దొరికానా? ఏదో నాలుగిళ్ళడుక్కొని పొట్ట పోసుకొనేవాణ్ణి నన్ను చేసుకోవడమేమిటి? నీ కేమన్నా పిచ్చి పట్టిందా? యిష్టం లేదా అంటావేమిటి? నా కెవరి మీద యిష్టం లేదు? అందరి మీదా ఇష్టం వుంది. నా కందరూ యిష్టులే।" అన్నాడు. రామదాసు కూలిపోతూ, కుమిలి పోయి.

"కళ్ళు మూసినా తెరిచినా నీవే కనిపిస్తావు। నా మనసులో అంతా నీవే। నీవు తప్ప ఈ లోకంలో నా కెవరూ కనిపించడంలేదు. నిన్నొదిలి నేను బ్రతకలేను రాందాసూ।అందుకనే అలా అన్నాను." అంది జిలానీ.

"నీకు మతి తప్పిందమ్మడూ।" అన్నాడు.

"మనిద్దరం ఎటన్నా వెళ్ళి బ్రతుకుదాం. రా రాందాసూ।

"వెళ్ళి బ్రతకడ మేమిటి? ఎక్కడైనా బ్రతగ్గలం. ముష్టి బ్రతుకు కష్టమైంది కాదు. అసలు నీకా బుద్దెలా పుట్టింది? ఎందుకు పుట్టింది? మనిద్దరం లేచిపోదామంటావేమిటి? ఏదో 'హరీ! రామా।' అంటూ కాలక్షేపం చేసుకుండేవాణ్ని, నన్ను పెళ్ళాడతావా అమ్మడూ। అసలు నాకు పెళ్ళేమిటి?" అన్నాడు రాందాసు.

"అసలు నీవు పెళ్ళి చేసుకోవా?"

"నాకు పెళ్ళేమిటమ్మడూ? నేను లోకులు చేసే పాపాలు దేవుడితో చెప్పటానికి పుట్టాను. నేను పెళ్ళి పెటాకులు చేసుకుంటే దేవుణ్ణి కొలిచేదెలా? ఆ రామయ్యకు ఎవరు చెపుతారు? ఆయనకి పాపాలు పోగొట్టాలని ఎలా తెలుస్తుంది? నువ్వూరుకో। నేను మీ నాన్నతో మాటాడి అన్నీ సరిచేస్తాను. పిచ్చివాడు, అతనేమనుకుంటున్నాడో?" అన్నాడు.

"నేను నిన్ను తప్ప మరొకర్ని చేసుకోను. నిన్ను వదిలి బ్రతకలేను." అని జిలాని అతన్ని కౌగలించుకొని ఏడ్చింది.

"నేనెక్కడికి పోతాను? తండాలోనే ఉంటాను. మామూలుగా నీకు పాటలు నేర్పుతాను. కథలు చెపుతాను. దైసీ మాత్రం పరాయి వాడా? నాతో నీవు ఉంటానంటే ఒద్దంటాడా? తండ్రీ బిడ్డలను వేరు చేయాలని ఎవరనుకుంటారే పిచ్చిదానా! అలా చేస్తే ఆ రామయ్య తండ్రి ఊరుకుంటాడా!" అంటున్నాడు.

# 8

అంతలో ఎటునుండి వచ్చారో లంబాడీలు వచ్చి చుట్టుముట్టారు.

జిలానీ "ఆఁ" అని కేక వేయబోయింది.

వాళ్ళ చేతుల్లో ఉన్న బరిసెలు రామదాసు ఒంటినిండా కాళీ లేకుండా దిగబడిపోయాయి.

భజనచెక్కలు గలగలలాడుతూ నేల రాలాయి.

తంబురా ఢాంమ్మంది.

రాగిచెంబు దొర్లుకుంటూ క్రిందికి వెళ్ళిపోయింది.

ఆ సద్దులో రామదాసు "రామయ్యతండ్రీ!" అన్నది వినిపించ లేదు!

జిలానీ వెర్రిగా కేక వేసి పడిపోయింది.

రామదాసు కళేబరం రాతి మీదికి ఒరిగిపోయింది.

ఆ అమ్మాయికి ఆ విషయాలేవీ తెలియవు.

ఆ రాత్రి బాగా ప్రొద్దు పోయాక తండానాయకుడు వచ్చాడు.

అంతా విని భోరున ఏడ్చాడు.

"ఎంత పని జరిగిందిరా!" అని అరిచాడు పిచ్చివాడిలా.

ఆ తర్వాత ఆ అమ్మాయికి స్పృహ వచ్చి, "రాందాసూ!" అంటూ కళ్ళు విప్పింది.

ఎదురుగా గుడిశలో తండ్రి నెత్తిన చేతులు పెట్టుకొని కూర్చు న్నాడు.

ఎదురుగా అమ్మ కనిపించింది.

ఆ తర్వాత ఆమెకు తెలియదు.

ఆమె అలాగే నడచి రామదాసును చంపిన జాగాలోనికి పరుగు పరుగున వచ్చింది.

నీవు విన్నావు చూడూ, ఆ పాట పాడుకుంటూ కొండపైకి వెళ్ళిపోయింది.

ఆమెను బలవంతంగా లాక్కొచ్చేవాళ్ళు.

తిండి పెట్టేవాళ్ళు

తిరిగి ఏడుస్తూ అక్కడికి వెళ్ళి కూర్చుండేది.

రోజులు గడచి పోతున్నాయి.

తండాలో ఎవ్వరికీ మనశ్శాంతి లేదు.

చీకటి పడుతుండగా రాందాసు ఆ గుడిశలో కూర్చుని, "ఏమయ్యా రామయ్యా!" అంటున్నట్టుగా ఉండేది.

తెల్లవారీ వారకముందే భజన చెక్కలూ, తంబురా వినిపించేవి.

అందరికీ పిచ్చెక్కినట్లుగా ఉండేది.

ఏదో భయం!

ఏదో వేదన!

ఏదో తెలియని ఆందోళన!

ప్రతీ చోటా రామదాసు గొంతు వినిపించేది.

గాలి పెద్దగా వీస్తే ఆ గాలిలో రామదాసు పాట వినవచ్చేది.

ఎండ బాగా కాస్తే అందులో తంబురా, అతని గొంతు,

వాళ్ళు అన్నాల దగ్గర కూర్చుండే కాలవగట్టు మీద రాందాసు గొంతు, "ఏమయ్యా రామయ్యా" అని వినిపించేది.

వాళ్ళకు అన్నం సహించేది కాదు.

ఆ తిన్నది అరిగేదికాదు.

ఎవరికి వారు భయం భయంగా బ్రతుకుతున్నారు.

వాళ్ళలో వాళ్ళే వాళ్ళకు తెలియకుండా "రాందాసూ!" అని కేక వేసేవాళ్ళు.

కేక వేశాక వారికి తెలిసేవి. రామదాసును తామే చంపుకున్నట్టు.

ఆ అమ్మాయి "వస్తాడు వస్తాడు, రాందాసు వస్తాడు" అని పెద్దగా అరుస్తూ." రాందాసూ, రాందాసూ!" అంటూ కొండమీదకు వెళ్ళిపోయేది.

అక్కడకు వెళ్ళి ఆ పాట పాడుకుంటూ తిరిగి తిరిగి ఎటు వెళ్ళేదో తెలియదు.

ఒక రోజున వాన కురిసింది.

ఆ అమ్మాయలాగే "రాందాసూ" అంటూ కొండమీదకు పరుగెత్తింది.

వాననీటి తేమవల్ల కాలుజారి దొర్లుకుంటూ, దొర్లుకుంటూ క్రిందకి వచ్చింది

ఆ తర్వాత ఆమె ఎవరికీ కనిపించలేదు.

ఆ తర్వాత ఏటికి కొత్తనీరు వచ్చింది.

ప్రతిసారిలా ఆ ఏటికి వరదవచ్చినప్పుడు పల్లెల్లోనూ, లంకల్లోనూ సహజంగా కలరా రావడంకద్దు.

ఆ ఏడూ కలరా వచ్చింది.

తండాలో ఒక పదిమంది మిగిలారు. "ఇది బాబూ! రామదాసు కథ!" అంది ఆ ఆకారంలేని గొంతుక.

వింటున్న నేను- "అంటే నీవు జిలానీవా?" అన్నాను.

ఆమె అక్కడ లేదు.

రాతిదగ్గర ఎక్కిళ్ళు వినిపిస్తున్నాయి. ఆ ఎక్కిళ్ళూ, ఏడుపూ మధ్య-

"రాందాసూ! రాందాసూ! ఎంతకాలం ఇలా కనిపించకుండా ఉంటావు!! నన్ను నీలో కలుపుకో రాందాసూ!" అని వినిపించింది.

నేను రాతి దాపుకు వెళ్ళి "నేను వెళ్ళి వస్తాను" అన్నాను.

నాకు సమాధానం రాలేదు.

"మనుష్యులనూ మార్చేసి
దేవతలా చేసేటి
లంబాడోళ్ళ రాందాసా!"

ఆ గీతం వివ్వడానికి కారణం - దాని వెనుక అంత బాధ ఉన్న సంగతి నాకానాడే తెలిసింది.

వాల్మీకి రామాయణానికి ఎంత బాధ కారణమో!!!

ఈ గీతం వెనుక కూడా అంత బాధ ఉంది.

బాధలేని కావ్యాలు అందువల్లనే విల్వవు.

కావ్యాన్ని వ్రాయడానికి, పదం పాడడానికి బాధ అవసరం.

అలా బాధపడి రాసినవే విలవాయి;విలువ గలవు.

ఏ భాష ఐతేయేం!హృదయంలో నుండి రావాలి-దానికి తగిన విలువ కావాలన్నప్పుడు. అంత బాధతో పాడింది కాబట్టే ఆ పదం, ఆ పాట ఈ నాటికీ హృదయాలను తొలుస్తుంది.

యింకా కూడా కదిలిస్తూంది.

—అయిపోయింది.—



# మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA133M129 |
| పుస్తకం పేరు | విజయ |
| తారీఖు | 31/10/24 |
| ముందు అట్ట | [illegible] |
| వెనుక అట్ట | [illegible] |
| మొత్తం పేజీలు | 101 |
| పెద్ద సైజు పేజీలు | no |
| ఖాళీ పేజీలు | C1, B1 |
| లేని పేజీలు | no |
| తయారు చేసినది | Susmitha |
| పేజీలు విడదీసినది | Thasin |
| స్కాన్ చేసినది | Ruksana |
| పరీక్ష చేసినది | HASEEMA |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | |